ఫోన్: 2066 టెలిగ్రామ్: హిందీసంఘ్
సంపుటి 6 సంచిక 2

# స్రవంతి

సాహిత్య మాసపత్రిక

సంపాదకులు
వేమూరి ఆంజనేయశర్మ
సి. నారాయణరెడ్డి

దక్షిణ భారత హిందీ ప్రచార సభ-ఆంధ్ర
6-2-959, ఖైరతాబాదు — హైద్రాబాదు - 4.

| సంవత్సర చందా | మే, | సంచిక |
|---|---|---|
| రు. 3-0-0 | 1959 | రు. 0-4-0 |

Recommended for use in all the public libraries and school libraries by the Director of Public Libraries, Andhra State, Madras, vide Proceedings Dis. No. 30/55 dated 6th January 1955.

## ఈ సంచికలో



ముఖచిత్రం: అమరావతీ గాయకులు

*సంపాదకీయం :*

# పార్లమెంటరీ కమిటీ హిందీ నివేదిక

భారతీయ రాజ్యాంగవిధానంలోని 344 వ సూత్రంప్రకారం రాష్ట్రపతి రాజేంద్రప్రసాద్‌గారు ఇదివరలో అధికార భాషా సంఘమును నియమించి ఉన్నారు. అధికార భాషా సంఘంవారు దేశమం దంతటా సంచారం చేసి పలువురు ప్రముఖులతో కలసి చర్చించిన తరువాత తమ నివేదికను పార్లమెంటుకు సమర్పించినారు. ఆ నివేదికపై తమ అభిప్రాయాలను తెలియజేయుటకై ౧౦ మంది రాజ్యసభ సభ్యులు, ౨౦ మంది లోకసభ సభ్యులు మొత్తం ౩౦ మంది సభ్యులతో పార్లమెంటరీ కమిటీ ఎన్నుకొనబడినది. పార్లమెంటరీ కమిటీ పలుసార్లు సమావేశమై విపులంగా చర్చించి తమ నివేదికను ది ౨౨-౪-౫౯ న రాష్ట్రపతికి సమర్పించినది. పార్లమెంటరీ కమిటీ నివేదికకు ౩౦ మంది సభ్యులలో ౨౩ గ్గురు అనుకూలంగా ఉంటే ౭ గురు కొన్ని విషయాలలో తమకు గల అభిప్రాయ భేదాలను వెలువరించినారు. ఫ్రాంక్ ఆంథోనీ అసలు నివేదికయే సరిగా లేదని అభిప్రాయపడినారు. కొద్ది నెలలలో ఉభయ సభలలోనూ ఆ నివేదికపై చర్చ జరుగనున్నది. ఆ సభలతో ఈ నివేదికకు యెక్కువ సంబంధం లేకపోయినా అక్కడ జరిగే చర్చలను కూడా రాష్ట్రపతి గమనించవలసి ఉంటుంది. అంతేగాక దేశం నలుమూలలా ఈ నివేదికపై ప్రజల అభిప్రాయం యేవిధంగా ఉన్నదో దానినికూడా రాష్ట్రపతి తప్పక గమనించగలరని మా విశ్వాసం. ఈ నివేదిక చాలా యుక్తియుక్తంగానూ, భారత దేశ గౌరవాన్ని ఇనుమడింపజేసేదిగానూ ఉన్నదని మా అభిప్రాయం. వాస్తవ పరిస్థితులను గమనిస్తూ, ఆదర్శాలను మర్చిపోకుండా ఈ నివేదిక తయారు చేయబడినది. భారతరాజ్యాంగ చట్టంలోనే ౧౯౬౫ నుండి హిందీని రాజభాషగా స్వీకరించగలమని మనవారు నిర్ణయించి ఉన్నారు. ఆ నిర్ణయాన్ని ఇప్పుడు త్రోసిపుచ్చడం ఉచితం కాదు. అయిననూ హిందీ రాజభాషగా ఉపయోగింప దగిన స్థితిలోనికి వచ్చేవరకూ ఇంగ్లీషునుకూడా మనం అంగీకరించక తప్పదు. ౧౯౬౫ తరువాత కూడా ఇంగ్లీషును మాత్రమే రాజభాషగా స్వీకరించగలమని చెప్పడం ఏ విధంగానూ న్యాయ సంగతమైన విషయం కాదు. అందువలన ఈ నివేదికలో రాజ్యాంగ చట్టంలోని నిర్ణయం ప్రకారం ౬౫ నాటికి హిందీ రాజభాషగా స్వీకరించ

బడగలదనీ, పార్లమెంటువారు అంగీకరించిన అంశాలలో ఇంగ్లీషును కూడా ఉపయోగించుటకు అవకాశం ఉండగలదనీ నిర్ణయించబడినది. ఈ నిర్ణయం అహిందీ ప్రాంతీయుల మన్ననలను పొందగలదని మా దృఢమైన నమ్మకం. అంతేగాక ప్రాంతాలలో ప్రాదేశిక భాషలూ, కేంద్రంలో హిందీ అమలులో ఉండగలవనీ నిశ్చయించడంవలన హిందీ భాష ప్రాంతీయ భాషలను అణగద్రొక్కగలదని భావించేవారి సందేహాలు దూరం కాగలవు. పారిభాషిక శబ్దాలను తయారు చేయుటకై నిపుణులతో ఉపసంఘాలు నియమించబడవలయుననీ, కేంద్ర ప్రభుత్వపు కార్యాలయాలలో పనిచేసే హిందీవారికి ఇంకొక భారతీయ భాషా, అహిందీ ప్రాంతీయులకు హిందీ తెలిసి ఉండవలయునని గూడా నివేదికలో పేర్కొనబడినది. బోధనామాధ్యమం విషయంలోనూ, న్యాయ స్థానాలలోనూ, పబ్లిక్ సర్వీస్ కమీషన్ పరీక్షలు జరుపవలసిన భాష విషయంలోనూ, చాలా ఉచితమూ న్యాయసంగతమూ అయిన నిర్ణయాన్ని పార్లమెంటరీ కమిటీవారు చేసిఉన్నారు. ఈ నిర్ణయాలను రాష్ట్రపతి అంగీకరించగలరని మేము విశ్వసిస్తున్నాము. ఇంగ్లీషుతప్ప హిందీ పనికిరానేరాదు అని వాదించేవారు ఇటు ప్రాంతీయభాషల వికాసానికీ, అటు హిందీ వికాసానికీ తీరని నష్టాన్ని కలిగించగలరు. ఇంగ్లీషును ౮ వ అనుసూచిలో చేర్పించుటకు కూడా కొన్ని ప్రయత్నములు జరుగుచున్నవి. ఆంగ్లో-ఇండియన్‌ల మాతృభాష ఇంగ్లీషే కనుక అట్టివారు మనదేశంలో చాలామంది ఉన్నారు కనుక ఇంగ్లీషును కూడా ఒక భారతీయ భాషగా అంగీకరించవలయునని వారి వాదన. అది సమంజసమే కావచ్చును; కాకపోవచ్చును. కాని ఇంగ్లీషు భారతదేశానికి రాజభాషగా ఉండవలయునని వాదించడంలో దూరదృష్టిగానీ దేశగౌరవదృష్టిగానీ ఉన్నట్లు కన్పించడంలేదని మనం స్పష్టంగా తెలుసుకొనవలసి ఉంటుంది. భారతీయ భాషగా హిందీ సంపూర్ణముగా వికసించి రాజ్య వ్యవహార నిర్వహణకు పనికివచ్చేవరకు ఇంగ్లీషును మనం ఉపయోగించుకొనవచ్చును. అందుకు ఎవరి అభ్యంతరం ఏమీ ఉండదు. కేంద్రంలోని ఉభయసభల సభ్యులూ పార్లమెంటరీ కమిటీ నివేదికను అంగీకరించగలరని విశ్వసిస్తూ ఇంత చక్కని నివేదికను తయారు చేసినందులకు పార్లమెంటరీ హిందీ కమిటీవారికి మా హృదయపూర్వకమైన అభివందనములు తెలియజేస్తున్నాము. ★

గేయం :

# నే నెవరిని?

— శ్రీ "అమరేంద్ర"

మానవ జీవనసాగర
ఘన తరంగ మాలలపై
ఫేన ధవళ హాసమునా ?
దీనహృదయ ప్రతిస్పంద
నినద భయదలయ మృదంగ
ధ్వాన శోకగానమునా ?
నే నెవరిని ? నే నెవరిని ?

కొలను అలలడోలలందు
కలల సోలు నెలవంకనా ?
చిరుగాలుల నటనమాడు
చిగురాకుల గుసగుసనో ?

జాలికనుల కొనల తొణుకు
లలితబాష్ప బిందువునో
యౌవన బింబాధరాల
లావణ్యారుణ శోభనా ?

మానసమహతీ ముఖరిత
మధుర రాగరేఖనో
తెలియని లిపితో రాసిన
తొలి వలపుల లేఖనో ?

కోమల కరకంకణముల
ఆమని ఝుంకారమునో ?
కాళరాత్రి కురుల మెరయు
తారా సుమదామమునో ?

శుభప్రభాత నయనాంచల
సుఖ స్వప్న స్మరణమునో !
నరుల నిరాశాశ్రువులను
మెరిసే రేపటి వెలుగునా ?
నే నెవరిని ? నే నెవరిని ?



# బొమ్మల పెళ్లి

(కీ. శే. రామసుబ్రహ్మణ్యం పవిత్రస్మృతికి చిహ్నంగా)

— శ్రీ జమదగ్ని

పిల్లలకు బొమ్మలంటే మహా ఇష్టం.

పెద్దవాళ్లకు పిల్లలంటే ఇష్టం.

అయినా ఆ పిల్లలాడుకునేందుకు ఏ తల్లీ మంచిబొమ్మ ఇవ్వదు. ఇస్తే ఇంకేమైనా ఉందా ? మర్నాటికల్లా కాళ్లూ చేతులూ విరగ్గొట్టి, ముక్కూ మొగమూ అరగదీసి, వట్టి మొండేలుచేసి కూర్చోపెడతారు, పండగనాడు కొలువులో పెట్టుకోవడానికి బొమ్మలే మిగలవు.

మాయా, లీలా అలాంటి అల్లరిపిల్లలు కారు. వాళ్ళే అసలు బంగారు బొమ్మలు. బొమ్మల్ని బొమ్మలుగా కాక బతికున్న బిడ్డలుగా చూచుకుంటారు.

ఆ పిల్లలఊహలు పందిరి కెక్కిన తీగల్లా పాకిపోతాయి. వాళ్ళిద్దరూ చేరారంటే లోకాలు గిఱ్ఱున తిరిగాయన్నమాటే.

ఉన్నట్టుండి వాళ్లు మామిడిచెట్టుకింద కూర్చుని బొమ్మలపెళ్లి చేద్దా మనుకున్నారు.

ఏడాది క్రితమే అక్కయ్యపెళ్ళి చూచిన లీల ఆడపిల్లతల్లిగా తా నుంటా నన్నది.

అన్నయ్యపెళ్ళిఅనుభవం గలిగిన మాయ పెళ్ళికొడుకుతల్లి అయింది.

మంచి బొమ్మో, మాయ బొమ్మో ఏదో ఒకటి ఉండాలిగా! లేకుంటే ఆటే లేదాయె!

అంచేత మాయ వెళ్ళి మెత్తని మట్టితెచ్చి మగబొమ్మను చేసింది. లీల కొత్త బుట్ట చింపి తాటాకుతో ఆడబొమ్మ చేసుకొచ్చింది.

తమ ఆటలసరంజాం సంచుల్లో నుంచి కొత్తగుడ్డముక్కలు తీసి వాటికి తగ్గట్టు అలంకారాలు చేశారు.

బట్టకట్టి, బొట్టుపెడితే ఏబొమ్మకయినా అందం వస్తుంది.

పొడుగు బొట్టుతో పెళ్లికొడుకూ: కళ్యాణం బొట్టూ, బుగ్గన చుక్కా పెట్టుకుని పెళ్ళికూతురూ కలకలలాడిపోయారు.

లీల ఆడబొమ్మని తన ఒళ్లో పెట్టుకుని 'మా లక్ష్మి నిస్తాం చేసుకోవో మీ రామానికి' అన్నది.

పెళ్ళికొడుకుని పక్క తీసి దాస్తూ 'నాదేముందమ్మా! అంతా మా వాడి ఇష్టంకాని' అన్నది మాయ.

'అయితే వాణ్నే అడుగుతానూ' అంటూ లీల 'ఏమండీ! రామంగారూ! మా అమ్మాయిని చేసుకుంటారా ?' అని అడిగింది.

వాడు తలకాయ అడ్డంగా ఊపాడు.

'చేసుకోడుట మ్మోయ్, చేదుమింగుతాడుట! బంగారంలాంటి పిల్లనిస్తానంటూంటే వద్దంటున్నాడు. అన్నీ సిద్ధంచేసుకున్నాక ఇప్పుడు నేనేం చేసేదమ్మా!' అంటూ దిగాలుపడింది లీల.

'మా చంద్రమన్నయ్య చెపితే ఏమన్నా వింటాడేమో. వాడిచేత చెప్పిస్తాలేవే! నువ్వు బెంగపెట్టుకోకు,' అని ఉపాయం సూచించింది మాయ.

అంతలో పెద్ద చదువు చదివిన రామానికి మంచి ఉద్యోగం వచ్చేసింది. దాంతో వాడు పట్నం వెళ్ళి అక్కడ ఉద్యోగంలో చేరి వాళ్ళ మామయ్యతోనే ఉంటున్నాడు.

రామాన్ని తీసుకుపోయి మాయ ఈ మూల క్రోటను మొక్కదగ్గర పెట్టి చక్కావచ్చింది. అదే పట్నమన్నమాట.

మామిడిచెట్టుకింద కూర్చుని అబ్బాయి పెళ్ళిసంగతి కనుక్కోమని అన్నయ్యకు ఉత్తరం వ్రాసింది. తన స్నేహితురాలు లీల వాళ్ళ లక్ష్మి నిస్తానంటోందనీ, ఆ పిల్ల బాగానే ఉంటుందనీ. తనకు చేసుకోవాలని ఉందనీ, ఆలస్యమయితే చేయి మీరి పోగలదనీ, అంచేత ఏదోఒకటి త్వరగా తేల్చి తనకు వెంటనే సమాధానం వ్రాయమనీ మరిమరీ కోరింది మాయ.

లీల లక్ష్మిని తీసుకుపోయి ఆ మూల మల్లెచెట్టుకింద పెట్టింది. అది లీల గారి పెద్దమ్మాయి బాల కాపురం చేస్తున్న బందరు. చెల్లెల్ని రమ్మని అక్కయ్య ఉత్తరం వ్రాసిందట, అందుకోసం వెళ్ళిందట.

ఇక్కడ పట్నంలో చెల్లెలి ఉత్తరం రాగానే చంద్రం రామంతో పెళ్ళి సంగతి ప్రస్తావించాడు. వాడు పెళ్ళిమాట ఎత్తేటప్పటికి కస్సు మన్నాడుట. పైగా పెద్ద ఉపన్యాసంకూడా చేశాడుట. 'ఏదో పిల్లని ఎవరో చేసుకోమంటే చేసేసుకోవడమేనా ? ఒకరి నొకరు అర్థంచేసుకోందే అసలు పెళ్ళే చేసుకోగూడదు. నాలుగైదు నెలలైనా కలిసిమెలిసి ఉండందే ఒకరికొకరు ఎల్లా తెలుస్తారు ? వాళ్ళు చెప్పారు, వీళ్ళు చెప్పారు అని చేసుకోవడమున్నా తర వాత నానాయాతనా పడడమూ తప్ప ఫలిత మేముంటుంది ? అదీకాక పెళ్ళి

చేసుకున్నాక పెళ్ళాన్ని సుఖపెట్టాలిగదా! దానికి తగ్గ డబ్బుండద్దా! ఒక ఏడాదో రెండేళ్ళో, జాగ్రత్తగా కాలక్షేపం చేసి, తగినంత సొమ్ము దాచుకుంటేనేగాని పెళ్ళినిగురించే ఆలోచించను. అందాకా ఈవిషయంనాతో మాట్లాడ వద్దు.' అని గట్టిగా కోప్పడ్డాడుట కూడాను.

ఈ సంగతులన్నీ మాయ వెళ్ళి లీలతో చెప్పి 'నువ్వేమనుకోకు లీలా! ఈకాలపు పిల్లలే యింత! దేనికైనా కాలం కర్మం కలిసిరావాలి, నాలుగు రోజులుపోతే ఈ తిక్క దానంతటదే తిరుగుతుంది. అప్పుడు దేవుడా అంటూ మనం చెప్పినమాట వాడే వింటాడు.' అంటూ ధైర్యం చెప్పింది.

పిల్ల పెళ్ళి ఆలస్యమవుతోందనేగాని రామం అన్నమాటల్లో తప్పేమీ కనిపించలేదు లీలకు. పైగా ఎప్పటికైనా దేవుని దయవల్ల అతనే తన అల్లుడు కావాలనికూడా అనుకుంది.

ఇంతలో ఏడాది తిరిగిపోయింది. కాని లక్ష్మిని రామం చూచే అవకాశమే కనిపించడంలేదు. ఏంచెయ్యాలో తోచలేదు లీలకు. 'ఈ పెళ్ళి అయితే నీకొండకు వస్తాం తండ్రీ' అని తిరుపతి వెంకన్నకుకూడా మొక్కుకుంది.

దాంతో చక్రం తిరిగి అడ్డంకులన్నీ తీరిపోయాయి. నిజంగా ఆ దేవుని మహిమకాకపోతే సరిగ్గా ఇప్పుడే బాలావాళ్ళకూ పట్నం బదిలీ కావడమేమిటి? వీళ్ళు వెళ్ళి వెళ్ళి మాయగారి అన్నయ్య చంద్రం కాపురముంటున్న ఇంట్లోనే రెండో వాటాలో దిగడమేమిటి ?

లీల పరుగెత్తుకువెళ్ళి మాయతో ఈ సంగతి చెప్పి, 'మా లక్ష్మివాళ్లతో అక్కడే వుందాయె. మంచిచెడ్డలన్నీ విచారించుకుని రామం ఏమంటాడో కనుక్కుని చెప్పమని ఇప్పుడు మళ్ళీ వ్రాయవమ్మా మీ అన్నయ్యకూ' అని ఒత్తిడి చేస్తూ లక్ష్మిని తీసుకపోయి క్రోటను మొక్క దగ్గర రామం పక్కన కూర్చోపెట్టి చక్కా వచ్చింది.

పట్నంలో బాలా వాళ్ళు వెళ్ళినదగ్గరనుంచి చంద్రంగారి కుటుంబంతో కలసి మెలిసి ఉంటున్నారు. బంగారుబొమ్మ లక్ష్మి ఇంట్లో తిరుగుతూ ఉంటే ఇల్లంతా కలకలలాడింది. అందులో ఎదిగిన బిడ్డకూడానేమో ఎక్కడలేని అందంతోనూ మిసమిసలాడుతోంది. ఇంట్లో ఉన్నప్పుడల్లా ఆమెనుచూస్తూనే ఉన్నాడు రామం. తవివితీరక మధ్య మధ్య సెలవులుకూడా పెట్టాడు. ఆతనికి తహతహ ఎక్కువయింది. ఎంత చెడ్డా మగాడాయె. మీ పిల్లని నాకివ్వండని

ఏట్లా అడగగలడు ? వాళ్ళే ఎప్పటికైనా ప్రస్తావిస్తారేమో అని ఆశతో నిరీక్షిస్తున్నాడు.

రామం మనసుమారిన సంగతి చంద్రం కనిపెట్టాడు. ఒకరోజున నిలవేసి 'వాళ్ళ లక్ష్మిని రెండునెలల బట్టీ చూస్తున్నావుగదా, నీకేమైనా నచ్చిందా చెప్పు' అన్నాడు చంద్రం.

చటుక్కున 'సరే' అంటే బాగుండదని సంకోచించి రెండురోజులు పోయాక 'మీ అందరికీ ఇష్టమయితే నాకే మభ్యంతరం లేదు మామయ్యా' అని రామం తన అంగీకారం తెలిపాడు.

చంద్రం వెంటనే చెల్లెలికి ఉత్తరం వ్రాశాడు. మాయ పరుగెత్తుక వెళ్లి లీలతో చెప్పింది శుభవార్త.

లీల సంతోషించి, వెంటనే లక్ష్మినింటికి పంపించెయ్యమని ఉత్తరం వ్రాసింది. పెళ్ళికాని బిడ్డ పరాయిచోట వుంటే కన్నతల్లి కెంత ఆరాటమో లోకానికేం తెలుస్తుంది ?

మూడోరోజుకల్లా లక్ష్మి అక్కయ్యతోపాటు ఇంటికి వచ్చింది.

ఏపనయినా అనుకున్నప్పుడయిపోవాలి. ఆలస్యమయితే అమృతంకూడా విషమవుతుందంటారు. అంచేత మాయ వెంటనే ముహూర్తం పెట్టించి రామాన్నీ చంద్రాన్నీ రమ్మని ఉత్తరాలు వ్రాసేసింది. వాళ్లూ వచ్చేశారు.

ఇటు లీలా గారింట్లోనూ, అటు మాయగారింట్లోను బిలబిలలాడుతూ చుట్టాలు మూగిపోయారు. వచ్చినవాళ్ళకన్నీ అమర్చిసద్దుకోవడంలోనే వాళ్ళ పని అయిపోతోంది'

చెట్ల చాటున వేరు వేరుగా కూర్చొని తమలో తామే ఏమిటేమిటో అనుకుంటున్న పిల్లల్ని చూచి 'ఏమిటమ్మా చేస్తున్నారు ?' అన్నాడు రంగయ్య.

'బొమ్మలపెళ్లి తాతా ! మాకు కాస్త పందిరేసిపెట్టవూ ?' అని అడిగారు పిలలిద్దరూ. 'అంతకంటెనా తల్లీ !' అంటూ తాత నాలుగు కఱ్ఱపుల్లలు తెచ్చి గుంజలు పాతి పందిరేశాడు మామిడిచెట్టుక్రింద. నాలుగు మండలు కోసి తోరణాలుకూడ కట్టిపెట్టాడు.

లీలవెళ్ళి తల్లినడిగి ఇన్ని బెల్లం కలిపిన అటుకులు పళ్లెంలో పోసుకొచ్చింది. నాన్నగారినడిగి బొమ్మలపెళ్లికని ఓ రూపాయ కూడా తెచ్చింది.

బొమ్మలపెళ్లి సరదా లేకపోయినా గోపీగాడు అక్కచేతిలో పళ్లెం చూచి ఆవెంటపడ్డాడు. వాడికి అటుకుల ఆశపెట్టి, పిల్లలనందరిని కేకే సుకు రమ్మన్నది అక్క.

వాడు బూరా ఊదుకుంటూపోయి మరీ పిల్చుకు వచ్చాడు. పావు గంటలో చెట్టుకింద బాల సంఘం బలిసిపోయింది.

ఇంక ఆలస్యం చెయ్యడానికి వీల్లేదు. అప్పటికప్పుడు తాతకి రూపా యిచ్చి కాయితం చుట్టిన బిళ్ళలూ, తమలపాకులూ తెమ్మన్నది లీల. నిజం పెళ్ళికి సంచుల్లో లడ్డూలూ తాంబూలం పెట్టి ఇస్తారు వచ్చినవాళ్ళకు, బొమ్మల పెళ్ళికి ఇవైనా ఇవ్వద్దూ.

'ఇంకా ఎంతసేపర్రా ?' అంటూ గోపీ జోరుగా వాయించాడు బూరా. మాయా, లీలా చెరోవైపునుంచీ బొమ్మల్ని తెచ్చి పందిరికింద కూర్చోపెట్టారు.

పైనుంచి పచ్చని పండొకటి రాలింది. బలేబలే అంటూ పిల్లలంతా చప్పట్లు కొట్టారు.

ఇద్దరు పిల్లల్ని జేబురుమాలు అడ్డంగా పట్టుకు కూర్చోమన్నారు బొమ్మల మధ్య. మాష్టారబ్బాయి బాబుకు కుంకుమబొట్టు పెట్టి పక్కన కూర్చుని వాడికి వచ్చిన శ్లోకాలన్నీ చదివెయ్యమన్నారు.

ఎప్పుడు జాగ్రత్తపెట్టిందో ఏమో తెరతీయించి పిల్లమెళ్ళో అసలైన తాళిబొట్టు కట్టించింది మాయ.

కాని నటుకులే బొమ్మల నెత్తిన పోసి తలంబ్రాలన్నారు. పిల్లలంతా చుట్టూ చేరి మంగళహారతి పట్టారు.

గోపీ మేళంతో, బాబు మంత్రాలతో పెళ్ళి మహావైభవంగా అయింది.

లీలా, మాయా పిల్లలందర్నీ బంతులుతీర్చి కూర్చోబెట్టారు. అంతలో తాత బిళ్ళలూ, తమలపాకులూ తెచ్చాడు. అటుకులూ అవీ అందరికీ పంచి పెట్టారు.

పళ్ళాల్లో మిగిలినవన్నీ తాత ఒళ్ళో పోసి బొమ్మలచేత దణ్ణం కూడా పెట్టించారు.

తాతకు పరమానంద మయింది.

'మా బాగా చేశారమ్మా పెళ్ళి. మరి వీళ్ళ పేర్లేమిటి ?' అన్నాడు తాత నవ్వుతూ.

'లక్ష్మి, రామం !' అన్నది లీల.

తాత నిర్ఘాంతపోయాడు. ఆమాట అడక్కపోయినా బాగుండేది. రెండేళ్ళ క్రితమే తన ్రకి పెళ్ళయింది. ఎంతమంది పిల్లల్నిస్తామన్నా చేసుకోనని భీష్మించుకు కూర్చున్న రామం తన బిడ్డ అందాన్ని చూచి కోరి కోరి చేసుకున్నాడు. అయితేనేం, పెళ్ళయిన ఏడాది తిరక్కుండానే అందర్నీ మోసంచేసి పోయాడు వాడు.

తాత కవన్నీ జ్ఞాపకం వచ్చి కళ్ళల్లో నీళ్ళు తిరిగాయి.

'ఎందు కేడుస్తావు తాతా ?' అన్నది మాయ.

అవును......ఏడ్చి ప్రయోజనమేమిటి ?

బొమ్మలెంతో మనమూ అంతే! కాకపోతే మనం కదిలే తోలు బొమ్మలం. పిల్లలు బొమ్మలతో ఆడుకున్నట్టే మనతో దేవు డాడుకుంటాడు. ఆ దేవుడు కూడా మంచి బొమ్మల్ని దాచుకుని ఇట్టే పగిలిపోయే పిచ్చి బొమ్మల్నే ఆడిస్తాడు కాబోలు!

అలా అనుకున్నాడేకాని తాతకు దుఃఖమాగలేదు. తాత ఎందు కేడుస్తున్నాడో పిల్లల కర్థంకాలేదు.

'బొమ్మలు కావాలేమోనే!' అంటూ వాటివంకే చూస్తున్న తాత ఒళ్ళో ఆ రెంటినీ పడేసి మాయతో పరుగెత్తిపోయింది లీల.

(ఆలిండియా రేడియోవారి సౌజన్యంతో)



కవిత :

# సుజాత

— విద్వాన్ బి. యేలియ
డాక్టరు జె. ఆనందరావు

అది నవోదయ సమయ మహస్కరుండు
పూర్వగిరి శృంగములనుండి పుడమినిండ
రాగరంజిత కిరణ ప్రసార శోభ
తెలిమి విరజిమ్ముచుండె దిక్కులు హసింప.

బాలారుణ మరీచి పసిడి కాంతుల దోగి
జలజల ప్రవహించు ఝరులతోడ
క్రొమ్మావి గున్నపైఁ గుహుకుహూరవముల
గీతాలుపాడు కోకిలల తోడ
పూలబాలల నూపి పుప్పొడి విరజిమ్మి
వలపు గొల్పెడు గంధవహుని తోడ
కాసార రుచిరోర్మికల నుయ్యేలల నూగు
సారస రాజహంసములతోడ
చల్లనగు చందనపుఁ దరుచ్ఛాయలందు
రమ్యనర్తకులగు మయూరములతోడ
రత్నగిరిసాను పరిసరారణ్యభూమి
ప్రత్యణువు నిత్యనూతనప్రభలు నిండె.

అచటి ఫల్గునీ తటమునం దందమైన
జనపదంబున సేనాని సర్వసౌఖ్య
సంపదలుగల్గి సద్ధర్మశాలియనగ
గణన గాంచెను కాపువంగడమునందు.

అందముల రాశి మేలి పుణ్యాలవాల
సూనృతవచోధురీణవిశుద్ధ చరిత
భవ్యయగు వనదేవతా భక్తురాలు
నయవినయత్రపాభూష సేనానిభార్య.

వేగుజామున లేచి యవ్వేలది మిన్న
భర్తృపదపద్మముల భక్తిఁ బ్రణుతిజేసి
దైవతార్చన సమ్మదోత్కలిక యగుచు
బయనమయ్యెను వనికి సంబరముమీఱ.

పాలబుగ్గల చిరునవ్వు పాపనొక్క
చంకలో నెత్తుకొని పాయసప్రపూర్ణ
స్వర్ణపాత్రను శిరముపైఁ జక్కనుంచి
వడిగ దేవ్యాలయమువంక నడచుచుండె.

ఆలయాలంక్రియార్థమై యరిగి నట్టి
దాసి తెల్పెను మార్గమధ్యమున గాపు
గరితకున్ శుభోదంతమ్ము కాంతులూర
తాఁ గనిన దివ్యమగు దైవదర్శనమును.

అమ్మా నేటి ప్రభాతమందు భవదీయాజ్ఞానుసారమ్ము నె
త్తమ్ముం జేరి పరాగమున్ మధుమరందం బొప్పు పద్మాలు, భృం
గమ్ముల్ గల్గు సరిత్సమీపమున నేఁ గన్నారఁగాఁ గంటి హృ
ద్యమౌ శ్రీవనదేవతాలయము నిత్యానంద సౌభాగ్యమున్.

వడివడిగ నేగి నేను దేవాలయంపు
ప్రాంగణంబున నిల్చి గర్భాలయమును
తేరకొని చూడఁగా నందు దివ్యమైన
కాంతిపుంజమ్మునందోఁచె శాంతమూర్తి.

ఆమె యీ వనదేవత యనెడి భ్రాంతి
గల్గె మానసమందు శీఘ్రమ్మె నేను
వెనుదిరిగి వచ్చితిని నీకు విన్నవింప
కనుమఱుఁగు నేమొ దేవి ! వేగమ్ము రమ్ము.

ఆస లూరించు దాసి దివ్యామృతంపు
భాషణమ్ములు విని కాపు పడతిమిన్న
సంభ్రమాశ్చర్య సమ్మద స్వాంతయగుచు
వేగ నేఁగఁగఁ దలపోసె విపినమునకు.

కాపుకుటుంబినీమణి యెకాయకి నిష్టవయస్యమార్గమున్
జూప నరణ్యముం గడచి సుందర శిల్పకళావిలాసమౌ
నీప రసాలబోధితరునిర్మలకోమలసీమగాంచె సం
దీపిత కుంజమంజుల నదీతటమందు భవాని కోవెలన్.

పూలపరీమళమ్ములను పుష్పాదులన్ సెలయేటి నీటిపై
దూలు తరంగ సంజనిత తుందిలబిందుభరంపు శీతవా
తూలము మందమందముగఁ దోరపు సమ్మదమొప్ప వీచెనా
శీలవతీమతల్లులును జిన్నినిసుంగును హాయిజెందగన్.

గమనభరమ్ము బాపుకొని కంజదళాయత నేత్ర లల్లనన్
సమదళపల్లవస్తబకశోభితతోరణపంక్తి దాటి గం
ధము ఘనసారమున్ మృగమదమ్మును కమ్మని తావులీన గుం
కుమ పసుపుంబసల్ గలుగు కోవెల జొచ్చిరి భక్తితోడుతన్.

మంచుమల మేలిశిఖరాల మధ్యమందు
గరము వెలుగొందు చంద్రశేఖరుని వోలె
భూరి నిష్ఠాగరిష్ఠతన్ గూరుచున్న
దేవతామూర్తి గాంచిరి దేవళమున.

ముకుళమగు మేల్మితామర మొగ్గవోలె
తన కుమారుని చిన్నిహ స్తముల మోడ్చి
ఫాలమున జేర్చి యుంచి పాపాయిచేత
మ్రొక్కజేసెను దేవికి మోదమలర.

జననియున్ భక్తితో నమో స్తనుచు మ్రొక్కి
క్రమ్మువాసన లీను ఘృతమ్ము దనరు
పాయసాన్నంపు బంగారు పాత్ర నెదుట
నుంచి భక్షించు మంచుఁ బ్రార్థించె నంత.

వాసరమ్ములు దీర్ఘోపవాసముండి
ధ్యానముద్రను వీడి తథాగతుండు
నేత్రములు విప్పి తనచెంత నిలిచియున్న
తల్లికొమరుల గాంచె సంతసము మీఱ.

భక్తి నొసఁగిన పాయసోపాయనమును
స్వీకరించిన సర్వార్థసిద్ధుఁ డామె
నమృతసదృశప్రియోక్తి నమ్మా యటంచు
పిల్చి మీరెవ్వరనుచు సంప్రీతి నడిగె.

"జననీ నన్ను సుజాత యందురు దయాసాంద్రుండు సేనానినా
యనుగుంభర్త భవత్కటాక్షమున సర్వైశ్వర్యముల్ కల్గి జీ
వనముం జేతుము గాని పుత్త్రసుఖ సౌభాగ్యంబులేకున్కినో
వనదేవీ! నిను వేడితిన్ మును సుపుత్రప్రాప్తి గల్గింపగన్.

నీవరప్రసాదమ్మున నేడు నేను
పుత్రవతి నైతినా పూర్వ పుణ్యఫలము
పండె నిన్గాంచఁ గన్నుల పండువయ్యె
కామితార్థప్రదాయినీ ప్రేమమూర్తి!

పాలడన్నిండుగా నుగ్గుబాలుచేసి
బాలకుని బోసి నోటిలో వ్రేలినుంచి
బొజ్జ నిమురుచు మెలమెల్ల బోసి, యార
గించి నంతట బోరుకాడించినాను.

కన్నుంగవ కాటుక యిడి
తిన్నని ఫాలమున బొట్టు దీరిచి ప్రేమన్
చన్నిచ్చి యేడు పుడిపితి
పన్నుండగ జేసి బాలు బంగరు డోలన్.

పాలమున్నీటి యలలలో ప్రభవమైన
బాలచంద్రుని బోలు పాపాయి హాయి
సోలి కనుగూర్కం దూగుటూ యేల నూపి
జోలపాడితి నమృతమ్ము జాలువార.

మొలక ముత్తియముల ముగ్గుల తులకించు
అందమైన నా గృహాంగణమున
దోసపండువోలె దొగాడు సుతుగాంచి
పరవశమున నేను గరగిపోతి.

దాసి చేయూతగా లేచి తప్పటడుగు
లిడుచు నత్తత్త యంచును నుడువుకొంచు
కూర్మి జనకుని యంకాన కొలువు దీరు
ముద్దు సుతుగాంచి లోలోన మురిసిపోతి."

శీలవతియైన తత్పురంధ్రీలలామ
మాటలాలించి వచియించె మౌని యిట్లు:
"నేను వనదేవతనుగాను నిజము సుమ్ము
కపిలవస్తుపురమ్ము నా కాపురమ్ము.

ఘనుడు శుద్ధోదనుండను మనుజనాథు
పట్టమహిషి మాయాదేవి పట్టి నేను
పాప లోకోద్ధరణకై తపమ్ము సేయ
వచ్చినాడను వనికి వైభవము వీడి."

శాక్యమునిసింహుఁడంచు సుజాత యెఱిఁగి
భ్రాంతివిడి యట్టె నిర్ఘాంతపడుచు నిలిచె
మురువుగొల్పెడి నీలి ముంగురుల బాలు
నెత్తుకొని సుగతుఁ డాశీర్వదించె నిట్లు.

సత్యసుందర శివమై ప్రశస్తమైన
శాంత్యహింసా మహామంత్ర జపమొనర్చి
ప్రియముగా నార్తరక్షణబిరుద మంది
వర్ధిలుము బాలకా శతవత్సరములు.



ఈమధ్యచేసిన పరిశోధన :

# నన్నయ్యకు ముందున్న తెలుఁగు కవులు

— శ్రీ మల్లెల నారాయణ

నన్నయ్యకు ముందు ప్రాచీన యుగమున తెలుఁగుకవులే లేరనెడి వాద మొకటి చాలకాలమునుండి నేటికినిఁగూడా వచ్చుచున్నదే. కానీ నన్నయ్యకు ముందు తెలుఁగు కవులు ఉండినారన్న నిరూపణకు ఘంటసాల, భట్టిప్రోలు, జగ్గయ్యపేట, పెదచెఱకూరి శాసనములలోని పద్యములు, జావళీ మార్గ లయలు ఏనాడో నిదర్శనములు చూపినవి. ఇక కొంచెం చారిత్రకంగా తడవి కొని మాచినచో క్రీ. శ. 9 వ శతాబ్దమున బాదాని (బాదామి) చాళుక్యులు దక్కను ప్రాంతములోని వాతాపిదుర్గమును రాజధానిగాఁ జేసికొని రాజ్య పరిపాలన నిర్వర్తించుకొనుచుండెడి సమయములో సారస్వతకళామతల్లి కాళ్లకు పసిడి గజ్జియలు గట్టుకొని నాట్యమాడినదనే చెప్పవచ్చును. బాదామి చాళుక్యులలో యెందఱో రాజులు పౌరుషవంతులు, కళాప్రియులు. వారిలో "కులెంగనాథునికి" సామంతుడుగా నుండిన "దేజమల్లముని" ఆస్థానమున పదునైదుగురు సంస్కృత పండితులు, యిరువది ముగ్గురు తెలుఁగు కవులు యుండిరని నా చారిత్రకగురువర్యులైన కీ. శే. మానవల్లి రామకృష్ణ కవిగారు ఏనాడో పేర్కొనినారు. ఆ సంస్కృత కవులలో కువలెంకభట్టు, పిట్టాలోలుడు సామిఖ్యాభిమూర్తి, రుద్ర ధనుంజయుడు, విడపొందు విడ్డూరుడు మొదలగు వారలు సుప్రసిద్ధులు. వారిలో కువలెంక భట్టు వ్రాసిన "ధనుర్వేదభాష్యము" నేటికిని జర్మనుదేశములో యున్నదని నుడివినారు. ఇక తెలుఁగు కవులలో (1) అవసానసేనుడు (2) పిల్ల ముక్కొర్ణుడు (3) భాజవిశలుడు (4) కాకుమ్మొత్త లుడు (5) భడ్డెకోలుడు (6) జిలభూజనుడు (7) దుంద్రభట్టు (8) సంభీలవుడు ముఖ్యులు. వీరిలో అవసానసేనుడు భేజమల్లుని ఆస్థానమున కవి చక్రవర్తిగా యుండి సైన్యాధిపతియై కార్యభారములను కూడా నిర్వర్తించుచుండెనట. కంబికోలము, విలద్బాద్భిణ్ణము, కపుకోల్కలిక, రూతుమర్మము, మొదలగు సంస్కృత భాషా గ్రంథములను తెలుఁగు భాషలోనికి అనువాదము గావించె నట. అవి పురాణ రూపముననో మరే యితర ప్రబంధ రూపముననో మనకు మాత్రము తెలియదు. ఇక్కడొక సందేహముగలగవచ్చును. అయ్యా !



నన్నయ్యకు ముందు అనేకరకములైన తెలుఁగుకవు లుండినారనెదరే, ఉండి నచో ఏదీ మరి వారు వ్రాసిన ఒక్క కావ్యముగానీ, కనీసం యీ పద్యము వీనిదని ఖచ్చితమైన నిరూపణ చేయుటకుగానీ ప్రబలమైన ఆధారములు కని పించవే అన్నచో దానికి కొంత చరిత్ర ముందున్నది. అది మీకు సాధ్యమైనంత వరకూ నాకు తెలిసి పరిశోధించినది విన్నవించెదను.

ఆనాడు బౌద్ధ జైన మతవాదము లోక ప్రక్కను, శైవ వైష్ణవ మత వాదము లోక ప్రక్కను ప్రమేయమైన రక్తధారా వాహినులలో విజృంభించు కొనుచూ ఒకరినొకరు తన్నులాడుకొని చచ్చుచుండిరి. ఆ చాళుక్యులలోనే కొందరు వైష్ణవులు, కొందరు శైవులు, మరికొందరు బౌద్ధులు, యింకా కొందరు జైనులు, తదితరులు తదితర మతములలోఁజేరి దేశమునే నాశనము గావించినారు. నాడుశైవులలోనే మూడు తెగలు (1) జృంభణశైవులు (2) అవ్యజృంభణ శైవులు (3) క్వాలిట్టశైవులు. ఈ క్వాలిట్ట శైవుతే నేటికిని తిరునల్వేలి కొంత కర్నాటక ప్రాంతములలో మధ్వులుగా మారినారు. క్వాలిట్ట శైవులు నాటి దినములలో విలసిల్లిన ఈ తెలుఁగు కవితామతల్లిని ధ్వంసమొనర్చిరి. వారు పరమ దుర్మార్గులు, నీచులు, వీర శైవులకును అద్వైతవాదులకును బౌద్ధ జైనమతముల వారికిని అగ్గి వేసినచో కొరగాకుండినది. క్వాలిట్టశైవులలో ముఖ్యుడు కులజైఖ్యుడు. ఈకులజైఖ్యుడు మహాక్రూరుడు. తన తండ్రియైన కులధ్వైనుని రెండవ భార్య యగు "పిసిమోలమ్మను" వివాహమాడినకులభ్రష్టుడు. వాని వంశవృతు మిది.

కులధ్వైనుడు

(భార్య) పిసిమోలమ్మ

కొమారులు

(1) కులజైఖ్యుడు (2) కులరామ్యుడు

వీడింకా అంతేగాక పదునొకండుమంది ముఠాదొంగలను తన చేతిక్రింద నుంచుకొని తెలుఁగునాట కనిపించిన తెలుఁగు కవిత్వ పొత్తములను అటు వైష్ణవ మతములకు, ఇటు శైవ మతములకు సంబంధించినవాటి నన్నింటిని కాల్చి బూడిదపా లొనర్చి రమ్మని ఆజ్ఞ జారీచేసినాడట. ఇదెంతటి నిజమో మనకు తెలియదు. కానీ కొంత దీర్ఘముగా ఆలోచించినచో క్వాలిట్టశైవులకు మామూలు ద్వైతాద్వైత మతములకు సంబంధించిన బ్రాహ్మణోత్తములఁ

జూచినచో సరిపడదు. మఱి ఆ దుర్మార్గుల ఆధ్యాత్మిక తత్వ మేదో మన కర్థముఁ గాదు. పోతే యిక పదవ శతాబ్దమునందు "జిలైన్" యుద్ధవీరు తెలుఁగు దేశము నేలెడు బాదామి చాళుక్యులకు తటస్థించినది. ఈజిలైండ్లు కళింగదేశములో నాడు నివసించుచుండిన ఒక కోవకు చెందియుండు ముచ్చు ఎరుక ల్లని మాత్రము సందేహము లేకుండా చెప్పవచ్చును. కర్ణాటకదేశములో కువలైట్టింబనుడు వ్రాసిన "జారిమీనమాలిక"లో ఈ జిలైండ్ల క్రూరతనమునుఁ గూర్చి చాలా చక్కగా వర్ణించినారు. వారితోకూడా కొంత తెలుఁగు సారస్వత కవిత్వ రచనలు నాశనమైపోయినవి. ఇక నన్నయకు పూర్వము 12 వ శతాబ్దములోని పాల్కురికి సోమనాథుని కాలముననున్న శైవ, వైష్ణవ వాదముల కన్నా మిన్నయైన మతవాదములు తీక్షణముగా అగ్ని జ్వాలాకాంతులవలె మండిపడిపోయెడివట. 12 వ శతాబ్దములోని రాజులు శైవమతపు వ్యాపన కార్యమై విదేశములకు ప్రచారమునకై భటులను అంపించుచుండగా 9 వ శతాబ్దములోని చాళుక్య రాజులు ఎవరైతే తమ తమ మతములలో చేరరో అటువంటి వ్యక్తుల నందఱిని చిత్రహింస గావించినారు. పుండ్రబాలవిఘ్నేశ్వరుడు రాజ్యపరిపాలన చేయుచున్నకాలములో మూడులక్షల అరువదివేల మంది వైష్ణవభక్తులను— ఏ మతమునకూ సంబంధించకుండా యుండెడి మధ్య ప్రజను పులులను వేటాడినట్లు వేటాడి చీల్చిచంపెనని గుట్టముకోటశాసనమందు గలదని "జాన్‌బుస్సెన్ కులీప్" వ్రాసిన "బ్రౌలీ ఆఫ్ ఖ్యా లైఫ్ హిస్టరీ"యందు పేర్కొన్నారు. ఈ గుట్టముకోటశాసనము నే డెచ్చ టున్నదో తెలియదు. పై పుండ్రబాలవిఘ్నేశ్వరుడు రెండవ "వజ్రబాణ" చాళుక్యుని తర్వాత వచ్చిన దౌహిత్రుడు. వీడు మహామతవాది. పరమదుర్మార్గుడు. "కెటోలీప్సియన్" అన్న చైనాదేశీయునకు "బూరెన్‌బోరాక్" అన్న చర్మవ్యాధి తనపాదమునకు అంటుకొనియుండ దానిని బాగొనరించుటకై ఇక్కడ గల ఒక వైష్ణవవాదియైన "పేర్లుబ్బ చంద్రయ్య" కడకు రాగా ఆ రాజు వానిని హతమార్చి చిత్రవధ గావించెనట. కారణం మతహేతువే. నన్నయకాలము వచ్చు వేళకు మత వాదముల విజృంభణము కొంత తగ్గినది. తగ్గిన దన్నచో ఆ యా మతములకు సంబంధించిన పీఠాధిపతులు బలవంతులు కాకపోబట్టియే. ఇక 11 వ శతాబ్దమున పశ్చిమ చాళుక్యులు వేంగిరాజ్య పరిపాలనకు పరిపాలకులుగా వచ్చిరి. అందులో రాజరాజనరేంద్రుడు ముఖ్యుడు. రాజరాజనరేంద్రుని ఆస్థానమున ఒక్క నన్నయభట్టారకుడేగాదు, రెండుమతములకు సంబంధించిన



కవిత, లల్లు మేథశ్శాలి, కవలోలుడు, భువనాభుడు, నారాయణభట్టు మొదలగు కవులు కూడా యుండినారు. వారు కూడా తెలుఁగు పద్యరచనకు నాంది పల్కియుండి యుందురనియే నా తలంపు. కానీ కర్మవశాత్తున మనకు వారు వ్రాసిన పొత్తములు లభింపలేదు. ఇక 12 వ శతాబ్దము మొదటి రోజులలో మళ్ళీ మతకల్లోలములు బయలుదేఱినవి. ఆ శతాబ్దమున నివసించిన కవులే పాల్కురికి సోమనాథుడు, జిల్లింగుల పెమరప్ప, కుబ్జనాథుడు, అథర్వణుని మేనల్లుడైన కాలిప్పకోలుడు మొదలగువారలు. పోయినచో 10 వ శతాబ్దమున దేశములో మాత్రము ఘోరయుద్ధ శంఖనాదములు హోరున మిన్నెత్తి హాహాకారములు చాటుచుండినవి. నాడున్న రాజు లెల్లరు మహామత ఈప్సితార్థులు, పెడమతవాదులు, మొరటుతనము గల్గి అవినీతికృత్యములకు పాల్పడిన దుర్మార్గులు. ఈ 10 వ శతాబ్దమున విలసిల్లిన కవిత్వము అంతా యింతా లేనిది. కానీ మత మన్న పిశాచ క్రూర దంష్ట్రికరవాలములందు బంధింపబడి తట్టుకొనలేక ఊపిరాడకే నలిగి నాశనము గావింపపరుపబడినది. ఎవ్వ రేమిఁ జేతురుగాన, ముఖ్యముగా 12 వ శతాబ్దములోని మతకల్లోలముల కన్నా 9 వ శతాబ్దము, 10 వ శతాబ్దముల నడిమి కాలమున నున్న మతకల్లోల వాహినే గొప్పదని నా వాదన. అంతేగాక యిందుకు తగిన ప్రబలమైన ఆధారములు పాశ్చాత్యులు వ్రాసిన చారిత్రకములేగాక మనదేశమునకు నాడు చూచిపోవుటకు వలసవచ్చిన విదేశీయుల వ్రాతలే సాక్ష్యములు. 10 వ శతాబ్దమున మతకల్లోలవాహినిని మనసునం దుంచుకొనియే రాజరాజ నరేంద్రుని ఆస్థానమునగల ద్వైతాద్వైత మతవాదియైన నన్నయ్య భారత రచనకు శ్రీకారము చుట్టినాడు.

ఇకపోతే నన్నయ్యమహానుభావుడే ఆదికవియై కవిత్వమునకు శ్రీకారము చుట్టి మంగళారతు లొసంగినారని చాలామంది వాదోపవాదములు గావించి కొనిరి. అంతేగాక ఈ వాదముమీద నాకు బాగుగా జ్ఞప్తికి వచ్చినతర్వాత చెన్నపట్టణ ప్రాచ్య పరిశోధనాలయమునందు పాదరక్షల ప్రయోగము గావించుకొనినారు. వారి పేర్లు నుడువుటకు నాకు మన సొప్పదు. అయినా వారిప్పుడు మరణించినారు. విడిచిపెట్టెదను. ఇక నన్నయ్యను ఆదికవి యనుటలో యెంత సబబున్నదో విమర్శకులైన మీరలే యూహించుకొనుడు. ఆదికవి అన్న నామము సంస్కృత భారతమును తెలుఁగులోనికి అనువదించిన మొదటి రచన సేతకొచ్చినదిగానీ తెలుఁగు కవిత్వమును మొట్టమొదట తాను

కనిపెట్టినదానికి మాత్రము గాదని నా ముఖ్య విన్నపము. ఇంతేగాక యిక మీరు సూక్ష్మముగా సందేహము దీర్చుకొనవలె నన్నచో నన్నయ్య వ్రాసిన రెండున్నర భారత పర్వములను చదివి అందులోని సొంపు, సూక్తివైచిత్రి, శైలి, నిగూఢార్థ భావరమ్యత, అక్షరపు వచనరచనాకుదింపు, పద్యబిగింపు గమనింపుడు. నన్నయే తెలుఁగు కవిత్వమునకు శ్రీకారము చుట్టిన వాడైనచో ఆ పద్యరచనాపద్ధతి ఉన్నట్లుండి ఆ విధమున పట్టువడిన దన్నచో మీరలకే నమ్మరాని సందేహము పొడమును. అంతకుముందు గల ఛందశ్శాస్త్రములు, అలంకార శాస్త్రములు, కొన్ని సులువు ప్రాయముగా యున్న పద్య గ్రంథములును ఆధారములుగాఁ జేసికొని రచన నూత్నపోకడ లలో సాగించినాడని అనవచ్చును. లేకున్నచో ఉత్పలమాల, చంపక, శార్దూల మత్తేభ, సీస, ఆటవెలది, తేటగీత, కంద, మధురాక్కర, మధ్యాక్కర, మాలిని, కవిరాజ విరాజిత వృత్త ఛందశ్శాస్త్ర కట్టుదిట్ట లక్షణములను స్వయముగా తానే సృష్టించినాడా ? పోనీ సృష్టించినాడనియే అనుకొందము. అందుకు తగిన ఆధారములు యిప్పటికేఁగాదు, అప్పటి కాలమునుండీ యే యొక్క టున్నదో చూపింపుడని పండితులకును, విమర్శకులకును మనవి జేసికొంటు న్నాను. నన్నయ్యకు పూర్వము లాక్షణికమైన కవిత్వము కోకొల్లలుగా యుండినదని నిరూపించుటకు గల పరిశోధనాత్మకమైన శాసనములలోని పద్యములు నా కడనున్నవాటిలో మూటినిమాత్రము విన్నవించెదను. ఆనాడు వ్రాసిన వృత్తములు నన్నయ్యగారుకూడా తన భారత రచనలో వ్రాయలేదు. బహుశా అవసరమై యుండియుండదేమో అని నేననుకొంటా. నాకు దొరికిన కడపజిల్లాలోని కలమల్లగ్రామశాసనములో ఈ క్రింది మూడు పద్యము లున్నవి. ఆ శాసనము 9 వ శతాబ్దములోని బాదామి చాళుక్యులకు సంబం ధించినది. వాటిపై ౯౪౩ కీ. శ. అని సంవత్సరముకూడా విస్పష్టముగా వ్రాసి నారు. పద్యములు మాత్రము సరిగా కనిపించలేదు. అవి ఏ సందర్భమున ఎవ రెందులకు ఏమిటికై వ్రాసినది తెలియకున్నవి. ఆ పద్యములు వ్రాసిన వాని పేరు మాత్రము యిటు లున్నది. (1) రా ..క...మల్ల...పు. ఎవరో యీ మహానుభావుడు అర్థము కావటములేదు. పోతే పద్యములు లక్షణ గ్రాహ్యములై ఉన్నవికానీ లక్షణము లేమో ఏ ఛందశ్శాస్త్రజ్ఞునడిగినా యింత వరకూ సమాధానము లేదు.

1\. *జవిక మాళవి :* కవలాలోలుడు; కర్ణఘటకర్పుండాలోత్తంగుడై
ఎవకే మొందగ జాడ్య ప్రపూ కర్జణ్యుపీఠం
బవయన్ సాగిరి విద్ధ బద్దెన్యస్య కార్ముకాసం
గవనిన్ రాల్చ విహీయులై హేయావ... మే.

2\. *డోలి...ఓ... :* ఎలుతత్ప్రర్జ ఘూర్జరుడు వినాహే
కలుసిత్రపూర్జితుండై కదలెన్
కలికాత్రపబంది కేశికంబున; వే
రలి వత్ప్రుల్లుండై సాక్షీక...రుగనీ.

3\. *ముకెసాళ్వని :* మేహాకమొందు దిత్యనాథకు దొం
టాహితుడై; మరణాశైత్య కంబో
వ; హిటకర్ముకుండై, వస్యామేసిరైయె
తుహిరో జన్మార్జనుడై ప్రాకె వాడకున్.

ఈలాంటి పద్యములు యెన్నో ఇంకనూ నాకడ ఉదాహరణములకు చూపవలెనన్నచో యున్నవి. ఇక ముఖ్యంగా మీకుఁదెలుపున దేమన నన్నయ్యే ఆదికవి యైనచో భాషలోగల ఛందస్సును, అలంకారములను, వ్యాకరణము తాను స్వేచ్ఛగా వాడుకొనక ఆ కట్టుదిట్టయమపాశములందు బంధితుడై యెందుకు బోవును గాన! కనుక అంతకు ముందుగల తెలుఁగుకవి తాను రచనబూనిన పదసొంపు, భావనిగూఢార్థ యింపు, రచనా మేళవింపు, కుదింపు, బిగింపు, బంపు కవిత్వమునకన్నా కొంత చక్కని స్వరూపము ఏదో ఒక తీరున మూర్తిగట్టినట్లుండిన దనే చెప్పవచ్చును. నన్నయ్యకుముందు తెలుఁగు కవిత్వమే లే దన్నచో అది పెడవాదమూర్గముగాక మరొండుగాదని నా తలంపు "పుల్లేకు బిజ్జలుని" బెడదూరిగుట్టశాసనములో ఈ క్రింది తెలుఁగు పద్యముగూడా సాక్షీ భూతము. బెడదూరు కడపజిల్లాలోని రైల్వే స్టేషనుగల కొండాపుర గ్రామమునకు 8 మైళ్లు దూరమునం దుండియుండకయుండును. ఆ బెడదూరును మొట్టమొదట 10వ శతాబ్దమునందుగల విజయాదిత్యుడు రాజ్యపరిపాలన గావించినాడు. ఆ శాసనమున బాదామిచాళుక్యులకు సామంతుడుగానుండిన వాడే పై పుల్లేకుబిజ్జలుడు. వీరివంశములోనివారి తర్వాత ఎవ్వరూ గూడా రాజ్యాధిష్ఠితులు కాలేదు. వీని కాలమునుండే శైవమతము మూఢప్రచారము లోనికి వచ్చినది. పాల్కురికి సోమనాథుని శైవమతము అంత అభివృద్ధికి వచ్చిన

దన్నచో వాడు ముందు బెట్టిన మతభిత్తే ఇంతపెద్ద యెత్తుగడగా చేసినదని హాము లేకుండా చెప్పవచ్చును. ఆ శాసనములోగల పద్య మిది.

"ఉజ్జమాళిక కే! పొమికర్ల దుర్జికరాజ్య సామ్రాట్ట
కే! పొచెతర్ల విక్రమసేనసంహార
కే! గటయోగి నిర్జిద్ర భీకరాంకళ
కే! చటురూపశాలి పునీపర్నోకీ
కే! ... ... ... యోధవీ."

అని ఉన్నది. ఈ పద్యమును నేను నాచారిత్రక గురువర్యులైన మొన్న మొన్న నే కీ॥ శే॥ మానవల్లి రామకృష్ణకవిగారూ కూడుకొని రాయలసీమలోని శాసన పరిశోధనావశ్యమై వెళ్లినప్పుడు బెడదూరిలో యిది వ్రాసికొన్నాము.

దీనినిబట్టి నన్నయ్యకు పూర్వము ఎన్నో యేండ్లనుండి ఎన్నో రకములైన లాక్షణికమైన చందశాస్త్రవృత్త పద్యరచన, జావళీ కవిత్వములు ఉండియుండి మతప్రేరేపణలచే నాళనమైపోయినవని ఘంటాపథముగా నుడువవచ్చును. నన్నయకు ముందుగల ఛందశాస్త్రవృత్తములు మేము పరిశోధనచేసిన శిలాశాసనములగుండా తేలినవి నలువదిమాత్రము యిక్కడ పేర్కొందును. (1) జగతి (2) పెదుత్తరి (3) శివకాళి (4) కాకుర్ల (5) ఉద్దిన (6) బొద్దళి (7) ఎలిపన్న (8) కృపకము (9) చిరునంకము (10) డిప్పకము (11) కులపాలి (12) కురతలి (13) కురదలి (14) అరమోలి (15) అరినె (16) అజ్జిక (17) నిడుబేగడ (18) శివరంగ (19) కాలింది (20) కార్జిక (21) మురవజ్జ (22) లంజకారుకి (23) ళప్పకోలి (24) కరండ (25) కాలిత్రైకరము (ఈ వృత్తము కర్ణాటకకవి యైన జయగోపుడు నృత్యపాళవము, అన్న మావిళె ఛందస్సు పద్యకావ్యములో ఉదాహరణకు వాడినాడని నా చారిత్రక గురువులంటుండేవారు) (26) తిన్నెకము (27) అంకార్ణము (28) పడకము (29) పడికెలి (30) మురము (31) మురజలి (32) గోకర్ణము (ఈ గోకర్ణ వృత్తమును జయాప సేనాని కందవిక్రమసేనవిజయంలో వాడినట్లు నా చారిత్రక గురువర్యు లంటుండేవారు) (33) జుమ్మిక (34) నెలజుమ్మిక (35) అలపక్కినె (36) అలసోవినె (37) గిల్లమార్జము (38) గిల్లగూర్జరీ (39) పొండిక్కలి (40) పొడుమిక్కెలి మొదలగు అనేకములైన వృత్తములు నాడు ప్రచారమునందుండినవి. కానీ కర్మవశాత్తు వీటికి లక్షణములు మాత్రము ఎటులుండెడివో యెక్కడ పరిశోధించినా దొఱకటం లేదు. పరిశోధకులైన

పెద్దలు ఓపికతో ఈ వృత్తముల లక్షణములను కనిపెట్టి వ్యాకరణమునకు మేలు చేకూర్చెదరని ఆశిస్తాను. దీనినిబట్టి నన్నయ్యకు పూర్వము ఎంతో తెలుఁగుభాష యుండి తీవ్రమైన మతకల్లోలము లౌటచేత అభివృద్ధికి రాక పోయినదని రూఢి యగుచున్నది. పైవన్నియు గూడా మే మిరువురము సేక రించిన అనేక శాసనముల లక్షణ పద్యములలో యిదిమాత్రము చాలా శుభ్ర ముగా కనబడగా యిక్కడ కనబరచినాను. పద్యములుమాత్రము చక్కగా కనబడలేదు. లేకున్నచో వాటియొక్క లక్షణములు బాగా తెలిసేటివి. ఇక యింతకన్నా ప్రబలమైన ఆధారములు చూపుదును గానీ వ్యాసవిస్తరణ భీతిచే అన్నీ యిక్కడ ప్రచురించుటకు వీలుండదు గాన కొన్నిమాత్రము చూపినాను. పరిశోధకులైన మీరలుగూడా ఆంధ్రదేశమునందలి ప్రతి గ్రామమూ తిరిగి అక్కడ యున్న ప్రాచీనశిలాశాసనముల పరిశోధించి నన్నయ్యకు ముందున్న తెలుఁగు కవితా రీతు లేవో వాటి నన్నింటిని పత్రికలద్వారా అప్పు డప్పుడు తెలియజేసెద రని ఆశిసా. నమసే.



# ఎంత చక్కని బాట!

శ్రీ అరుణ

వింతకాంతులతో నభోంతరాళమున
ఎంత చక్కనిబాట ఈ రేయి వెలసె!

పాలరాళ్ళను రత్నపాళితో పేర్చి
నీలాంబరపు త్రోవ నిర్మించి రెవరొ!
కమనీయ దీప్తి పుంజములు చిమ్ముచును
రమణీయ రథ్యయై రాణించె నద్ది.

అరవిచ్చు మల్లె క్రొవ్విరుల పందిళ్ళ,
విరజాజి పొదరిళ్ళ, విన్నాణ మొలికి
ఎలదోట లాబాట కిరువైపు లందు
తళుకొత్తె వెండిముగ్గులు తీర్చినట్లు.

ఆ వియత్తలమందు ఆ పాలపుంత,
ఆ వికస్వర లతాంతారామసీమ,
బరువు నిద్దురకంట పరికించి అట్టె
పరవశత్వము నొంది భౌమ్యబంధముల
పొలిమేరలను దాటి కల నొచు తేలి
అల మంజువాటిలో-అల బాటలోను-
అలరునై వికసింప నాశింతు-కాంతి
కళికనె దీపింప కాంక్షింతు-నేను.



కథానిక :

# కృష్ణమ్మ జోలపాడింది

— కుమారి వయ్యారం హరిప్రియ

నెమ్మదిగా నావ నీటిమీద కదలుతూవుంది. గాలివాటములో వెళ్ళుతూందికాబట్టి అంతగా తెడ్డువేయాల్సిన అవసరము లేకుండవుంది. రాజయ్యా పడవ ముందరిభాగంలో నుంచొని దూరాన అస్తమించబోయే సూర్యుని చూస్తున్నాడు. సుమారు ఇరువదిరెండో మూడో సంవత్సరాల వయస్సులో ఉంటాడు. నునుపైన కండలు తిరిగిన శరీరం. రంగులో ఓరకంగా తెలుపనే చెప్పొచ్చు. విశాలమైన కళ్లు, చక్కటి ముక్కు ముఖాన తీర్చిదిద్దినట్లున్నాయి.

ఏమిటో ఆ ఆలోచన..............

ఆ అస్తమించే సూర్యునిలో ఏముందో......

అలాగే చూస్తున్నాడు.

నది నడుమలో ఆ ఎఱ్ఱని కిరణాల జాలు ఓ తళతళ మెఱసే కుంకుమ బాటలా వుంది.

"ఈబాటపై నడిస్తేనో"......

"పాడు ఆలోచనలు"...... "ఏమిటి యిలాంటి ఆలోచనలు కలుగుతున్నాయి?" అనుకున్నాడు రాజయ్యా.

ఇంతలో పెనుమూడిరేవు చేరవచ్చాడు. నక్షత్రాలంత కళ్లు చేసుకొని ఓడరేవునంతా వొకమారు పరిశీలించాడు.

తన కన్నులపండువు కాన్పింపలేదు.

ఇంకా ఆత్రుతతో చూస్తూనే ఉన్నాడు.

ఇంతలో దూరంగా లేతరంగు గులాబిచీరతో సరస అడుగులో అడుగేసుకుంటూ అటూ యిటూ చూస్తూ వస్తూంటుంది.

ఆదగ్గరలో అవుపడ్డ తెఱచాపను చూడగనే ముఖం వికసిస్తుంది. ఆ క్రుంగిపోయే సూర్యుని కిరణాలు చిరునవ్వు నవ్వే ఆ చక్కటి పలువరసలతో ఎనిమిది సూర్యబింబాల్ని కనిపించేలా చేస్తున్నాయి. దాదాపు పదిహేడు, పద్దెనిమిది వసంతాల వయస్సు కలిగి వుంటుంది. వయస్సుకుతగ్గ అంగ సౌష్ఠవము, వన్నె చామనచాయలో ఉంటుంది. నిశ్చయంగా కారునలుపు మాత్రంకాదు. అంద మంతా తెల్లనివాళ్ళల్లోనే వుంటుందని వాదించేవారికి ఆమె ఒక మినహాయింపు. చంకలో బిందెను ఒక చేత్తో పట్టుకొంది. మరోచేత్తో

ఆ కృష్ణమ్మగాలికి, దువ్వెనకు వొంగక తమ ఘనతను చాటిస్తూన్న ఆ కురులు ముఖముపైన రెపరెప లాడుతూ చిలిపిగా చక్కలిగింతలు పెడుతూవుంటే శరీరపు పులకరింతకు నాజూకైన తన సన్నని చేతివేళ్ళతో వాటిని అణిచి పెడుతూంది. పాపం, తన ప్రయాసలన్నీ వృథా అవుతున్నాయి.

ఇంతలో ఓడ రేవు చేరింది. ప్రయాణీకు లందరు దిగిపోయారు. రాజయ్యా మెల్లిగా నావ దిగి వచ్చి నీళ్ళబిందెతో ఎదురొచ్చిన సరసను సమీపించాడు.

"ఏమిటి సరసా, యీవేళ నీముఖం ఆ సూర్యుని రంగువల్ల ఎర్రనైందే, ఓహో! ఎర్రపిల్లవైయావే!"

"పో! రాజా, నీకెప్పుడూ వేళాకోళమే. ఏదోకాస్త తెల్లగున్నానో లేదో అంత మిడిసిపాటు పనికిరాదు బావోయ్!"

"తమాషాకు అన్నాలే సరూ! దీనికే యింత కోపమైతే రేపు సంసార మెలా చేస్తావు?"

"నీ కన్నీ వేళాకోళాలే రాజా! నా పరిస్థితులు తెలిసికూడ యిలాగే మాట్లాడుతావు. మా నాన్నకి నన్ను నీకివ్వడం సుతరామూ యిష్టములేదు. మరేలాగా? పోనీ ఏలాగైనా నాల్గు వందలు తేలేవా బావా?"

"నీకుమాత్రం తెలీదా సరూ, నా పరిస్థితులు? యీ పడవే నా జీవిత ఆధారమని, దీనిలోనే మా అమ్మకూ నాకూ పూట పూటకు అన్నానికి, చిన్న చిన్న ఖర్చులూ జరిగిపోవాలి. భోజనానికే లేక పస్తులు పడుకొన్న రోజులుంటే నాలుగు వందలు ఏలా తేగలను? ఈపడవైనా ఏదో మా నాన్నగారితాలూకుదై సరిపోయింది. నా హయాములో మరోటికొనగలిగే తాహతుఅయినా వుందో? లేదో? నీవే చెప్పు సరూ, ఏమి చేద్దామో."

సరస దీర్ఘంగా ఆలోచిస్తూంది. చాలాసేపు ఆలోచించింది. ఏమికూడ ఊహ కందలేదు.........సుదీర్ఘంగా కృష్ణమ్మలోకి చూస్తూ ఓ గంభీరమైన నిట్టూర్పు విడిచింది వణికే ముక్కుపుటాల్లోంచి. ఇంతవరకు ఎంతో ఆశతో ఆమె ముఖకవళికలను అర్థంచేసుకొనే ప్రయత్నం చేస్తూన్న రాజయ్యా ముఖం లోని ఆ ఆత్రుత మాయమైంది. ఆమె నీరసము తన ఛాయను వెదజల్లింది అతనిపైకి. అయినా గుండె నిబ్బరంచేసుకొని తెచ్చిపెట్టుకున్న చిరునవ్వుతో మామూలు ధోరణిలో లీలగా సంభాషణలోకి కదిలించాడు. ఏదో అగ్నిగోళం ఆమె హృదయంలో రగులుతూన్నట్లుంది. నీలాల కండ్లలో లావా కరుగు తూంది. ఆ ఉప్పెన చూచాయగా అవపడుతూంది.

కొద్దిగా గద్గద కంఠంతో— "ఏముంది బావా, చెప్పడానికి. ఏనాడో ఓనాడు యీ పెద్దలనిచెప్పుకొనే వీరి పెద్దరికములేకుండానే కృష్ణమ్మ మన పెళ్ళి చేసి ఐక్యం చేసుకుంటుంది. అక్కడనైనా యీ పెద్దల నీడ పడకుండా ఉంటే అదే మహాభాగ్యము రాజా !"

"ఛీ! అలా అనకు సరూ ! మనమింకా జీవించవలసిన కాల మెంతో వుంది. తప్పకుండా మీ నాన్నకు నాలుగు నూర్ల రూపాయలు ఓలి యిచ్చి నిన్ను పెండ్లి చేసుకుంటాను. కన్నీరు తుడుచుకో సరూ, మీ నాన్నగారికి అనుమానం కలుగుతుంది. ప్రయాణీకులు వచ్చినట్లున్నారు, చీకటి పూర్తిగా అలుముకోకముందే వూరు చేరుకోవాలిగా. చీకట్లో జాగ్రత్తగా వెళ్లు."

"ఇంత చీకటి పడేంతవరకూ ఆలస్యం చేయకు రాజా, నిన్ను మరల వుదయం చూసేంతవరకు మనసు మనసులో నుండదు."

"నీకోసమే సరూ, నిన్ను చూడకుండా వుండలేను. కనీసం రోజుకు ఒక్కమారైనా చూడాలి. లేకపోతే ఏదేదో నిన్ను పరాయివాళ్ళ కిచ్చి మీ నాన్న పెళ్ళి చేసినట్లు, నీవు కెవ్వున కేక వేసినట్లు పిచ్చిపిచ్చి కలలు వచ్చి నన్ను నిద్రపోనీకుండా చేస్తాయి" అన్నాడు నవ్వుతూ, వెళ్లుతూ. పడవ కదలి పోతూంది. నదీప్రవాహమూ గాలీ రెండూ తెరచాపకు అనుకూలించాయి, వేగంగా వెళ్ళిపోతూంది. నెమ్మదిగా అడుగుతీసి అడుగువేస్తూ సరస నడచి వెళ్ళుతూంది యింటివేపు.

*　　*　　*　　*

సరస తండ్రికి పెనుమూడి దక్షిణ భాగంలో యిల్లు వుంది. స్వతహాగా చెడ్డవాడు కాదు. కాని తనకూ తన బావకూ మధ్య ఏదో చిన్నవిషయంలోనే అభిప్రాయభేదాలు కలిగాయి. అంతే. తర్వాత ఆ యింటి కాకి యీ యింటి మీద వాలటంలేదు. కాని భర్త చనిపోయినతర్వాత రాజయ్య తల్లియే ఎన్నోమార్లు యింటికివచ్చి ఎంతో నేర్పుతో ఆయనలో అణగారియున్న సోదరి అభిమానాన్ని నిద్రలేపింది. కొద్దిగా చలించాడు......

చాలా కాలంనుంచీ అనుకుంటూన్న విషయమే— నేడు పెద్ద విషమ సమస్య ఐంది.......,— సరసను రాజయ్య కివ్వకూడదని పూర్తిగా నిశ్చయించుకున్నాడు. ఏలాగో చెల్లెలి గోడు పడలేక కనీసం నాల్గువందల రూపాయలైనా ఓలి యిస్తే గాని పుస్తె కట్టేదాకా వీలులేదన్నాడు, తనకు తెలుసు నమ్మకంగా వాడు నాల్గు వందలు కాదుకదా నల్లఘై చిల్లిగవ్వలైనా తెచ్చి

యివ్వలేదని. అందుకే ఈ షరతు. తనేమో ప్రక్కగా పెండ్లి ప్రయత్నాలు సాగిస్తున్నాడు. తనకూ మూడు "లాంచ్‌లు" వున్నాయి. రాజయ్యకు పోటీ యంటూ ఉండే పడవలేకాక యీ లాంచులుకొన్ని.

ఆవల 'పులిగడ్డ'మీద ఓ చిన్న పూరిపాకలో తన తల్లితో రాజయ్యా నివసిస్తున్నాడు. బ్రతికి చెడ్డ కుటుంబము. కష్టించి తండ్రి సంపాదించే కాలంలో హాయిగా చింతలేకుండా తిరిగిన రాజయ్యకు యిప్పుడు సంసారభారము నెత్తిమీదపడ్డది. నాల్గు వందలకోసం ఎన్నో యత్నాలు చేశాడు. అన్నీ ప్రయోజనశూన్యాలే. పరిచయమున్నవారిని, అప్పుఅడిగాడు అమాయకుడు. ఎవరిస్తారనో, ఏమిచూసి యిస్తారనో, ఒట్టి భ్రమగాని. ఓ రోజు ఒక విచిత్రమైన ఆలోచన బుఱ్ఱకుతట్టింది. అమ్మతో చెప్పాడు. ఎలాగైనా యీ పడవను అమ్మితే మూడువందల పైచిలుకువస్తుంది. గుడిసె అమ్మితే ఓ పాతిక. ఇంకా అవీ యివీ అమ్మితే వెరసి నాల్గు వందలవుతాయన్నాడు. అమ్మ యీ పిచ్చివూహాలు మానమని వెంటనే చివాట్లేసింది.

కలలకూ యీ హృదయాలకూ ఏదో సన్నిహిత సంబంధం వున్నట్లుంది. ఒకే విషయంపై పదే పదే ఆలోచిస్తూంటే ఆ ఆలోచనలకి నిష్కృతి కలల్లోనేనేమో. ప్రతి రాత్రి తన సరూ కలలో అవుపిస్తుంది. ఈ పెద్ద మనుష్యులు విజ్ఞాన శాస్త్రము మితిమీరి కలలను అరికట్టే శక్తి సంపాదిస్తే మనము ఆపేక్షించేవారి నీడలైనా స్వప్నాలలోకి రాకుండా చేయగలరేమో! ఇది కూడ ఆశ్చర్యపడవలసిన విషయం కాదేమో! ఆ 'సైన్సు' అంతదూరం అభివృద్ధి చెందకుండాయుంటే యీ యువక జంటలకు కొద్దిగ మనశ్శాంతి వుంటుంది. ఎంతో చేరువలో స్వర్గము కనుపిస్తున్నట్లు, తాముత్వరలో అమరసౌఖ్యాలను భవింపబోయేటట్లు కలకంటున్నారు పడుచువారు.

సరసమాత్రం ఏం చేస్తుంది? తల్లి తనను కన్న వెంటనే యీ లోకానికి దూరమయింది. కొద్దికాలం అత్తయ్యావద్దే పెరిగింది. "చిన్ననాటినేస్తం రాజా. రాజానివాసం ఆవలి గట్టున అంటే కృష్ణా జిల్లా యట. తాను యీవలివడ్డున అంటే గుంటూరు జిల్లా అట. దానిలో ఏమి భేదాలో, మధ్య కృష్ణమ్మేగా; తెలివి తక్కువ ప్రభుత్వం" అనుకుంటుంది. ప్రపంచ విషయాలన్ని అదేమాదిరి అని తెలిసిని అమాయకురాలు. కృష్ణమ్మకు మాత్రం ఈజిల్లాల విషయం పట్టిందనేనా! తనకాళ్ళీడ్చుకు పోయినంతదూరం వెళుతుంది. అప్పుడప్పుడు యీ మానవులు ఆగవమ్మా అంటూ కాళ్ళకు యినుప గొలుసుల కట్టడాలేస్తుం



టారు, పూర్తిగా ఆగిపోవమ్మో అనేదానికి వారికీ భయమే, తమనే ఎక్కడ జోగొట్టుతుందోనని.

తాను కోరుకొంటూన్న రాజునే పెండ్లి చేసుకొన్నట్లు కలలు గని సంతసిస్తూంది సరస.

ఉదయం నీళ్ళకని వెళ్ళేసమయానికి తండ్రికూడా పొలంపని మీద వెళుతాడు. సుమారుగ పొద్దెక్కిన తర్వాత చంకలో బిందెతో ప్రత్యక్షమవుతుంది రాజాకు, బావరాక ఆలస్యమైతే హృదయం అల్లాడిపోతుంది. ఏదో హృదయంలో తొలుస్తూన్నట్లుంది. భారమైన అడుగులేస్తూ నిరాకరించే శరీరాన్ని నిదానంగా మిక్కిలి అయిష్టంతో యింటికి చేరుస్తుంది. త్వరగా రాకపోతే తండ్రికి తమ రహస్య కలయికలు తెలుస్తాయని భయం ఓ ప్రక్క. మధ్యాహ్నము గుడ్డలు వుతకనువచ్చినపుడైనా చూసి తీరాలి. సాయంత్రం నీటికొచ్చినపుడూ కనబడకపోతే పిచ్చెత్తినట్లుంటుంది సరసకు. ఆ రోజు రాత్రి తండ్రికి అన్నంపెట్టి, ఆయన బయట పడుకోను వెళ్ళాక, వొట్టి పళ్ళరాన్ని కడిగి చేతులు కాళ్లు కడుక్కొనివచ్చి తండ్రి మంచంప్రక్కన పడుకుంటుంది. ఇలా నిత్యకృత్యాల్లో సతమత మవుతుండేది సరస.

అది వర్షాకాల మారంభం. ఆరోజు వుదయమంతా ఉత్తరంవేపు మేఘాలతో నిండి వుంది. అప్పుడప్పుడు మెరుస్తూంది.

ఏమిటో ఆ మెరుపులో ఆకాంతి, పగలయినా కాంతితరగదు, రేత్రయినా కాంతి తరుగదు. తుంపరగా వర్షము పడ్డది. ఇప్పుడు ఆకాశం నిర్మలంగా వుంది. సప్తసముద్రాలలోని నీలిమరంగు ఆకాశంలో ప్రతిఫలించినట్లుంది. వెనుతుపాను ముందరి నిశ్శబ్దములాగ చాల గంభీరంగా వుంది వాతావరణం.

ఇంతలో దూదిని ఏకే సమయంలో వెదజల్లబడే ప్రత్తిలా చిన్న చిన్న మేఘాలు ఆవరించాయి గగనాన్ని. నీలాకాశాన్ని ఏదో తెల్లని ధోవతి కప్పి వేసినట్లు చేశాయి మేఘాలు.

రాజును ప్రొద్దునపూట చిరునవ్వుతో సరూ పలకరించింది.

సాయంకాలానికి కొద్దిగా చేతుల్ని చాచింది కృష్ణమ్మ.

ఆవలివేపున రైలుకెళ్ళే ప్రయాణీకులు రాజును తొందరపెట్ట సాగారు. తమ పనులన్నీ మధ్యలో ఆగిపోతాయని తమకోసమైనా నావను నీటిలో విడువుము అనీ, హెచ్చుడబ్బులిస్తామనీ, ప్రవాహము అంత ఎక్కువగాలేదని

చెబుతారు. డబ్బుకు ఆశపడక ఎలాగో ఓలా వారికి ఉపకారము చేసినట్లుంటుంది, తన సరూను చూసినట్లుంటుందని, వారిని తీసికొని యీవలివేపునకు వచ్చాడు. తనపోకడ తల్లికి తెలీదు. లేకుంటే పోనిచ్చేదికాదు.

ఆకాశంలో నిద్రపోతున్న ఆవులమందలాటి తెల్లని మేఘాలుతప్ప ఏమీలేవు. సూర్యాస్తమయం కూడా చూడ ముచ్చటగావుంది.

నీటికోసం వచ్చిన సరస— 'యింత వరవడిలోకూడా, చీకటిపడబోయే సమయంలో వచ్చేపడవ ఏదై యుంటుంది చెప్మా అనే వూహతోను, తనబావ నావ గుర్తువల్ల, ఆత్రుత, భయం ఎక్కువై అలాగే చూస్తూంటుంది.

సూర్యాస్తమయం అవుతోంది. సంధ్యాకాంత అలంకరించుకొన్న ఎర్ర కెంపుల కిరణాలన్నీ ఒక్కమారుగ నదిలో ప్రతిఫలించాయా అన్నట్లుంది. ఆ ఎర్రని క్రొత్తనీటికి సూర్యుని ఎర్రని కిరణాలు తోడై ప్రవహిస్తూంటే అలనాటి అశోకుని కళింగయుద్ధపు రక్తపుటేరులు గుర్తుకొస్తాయి.

నీళ్ళ వొరిపిడి హెచ్చయింది. పెనుమూడి కట్టె పొర్లే సూచనలు అగపడుతున్నాయి. సరస, రాజుని వెళ్ళవద్దని బ్రతిమాలింది. కాని రాజయ్య వినిపించుకోలేదు. "బావా నీవు వెళ్ళావంటే నేచచ్చినట్లు ఒట్టు." అంది సరస. "అలాఅనకు సరూ ! నాకు నీవెంతో నా తల్లీ అంతే. ఆమె నాకోసం ఎదురు చూస్తూవుంటుంది. గుడిసెలోకి నీళ్ళు వస్తాయో ఏమో ? ఆమెకొరకైనా తప్పక వెళ్ళాలి. నన్నడ్డకు సరూ!" అన్నాడు. ఆమె అంగీకరించలేదు.

ఇదే సమయమనుకొని దాపులోవుండే బిందె కాస్తా నీటిలోకిదూకి తన్నుతాను నింపుకొని యీ రోజైనా యజమానురాలికి పని తగ్గించాననే సంతోషంతో ఓమారు బోసినోటితో నవ్వి బుతుక్కుమంది.

ఆమె అతనికాళ్ళకు అడ్డు పడింది. అంతగా కావాలంటే తనతండ్రి 'లాంచి' తెస్తానన్నది. ఈ వొక్కరోజుకైనా క్షమించి దయతలచి నాన్న యిస్తాడన్న ఆశతో.

'సరే' అన్నాడు ప్రస్తుతానికి.

ఆమె అడ్డు తొలగగానే పడవలోకి ఉరికి లంగరుతీసి తెరచాప నెత్తాడు అంతే నావ శరవేగంతో పోతూంది జాలు దిక్కుగా.

"బావా !" "బావా !!" "రాజూ! !! అందూ గట్టువెంబడి ఎలుగెత్తి అరుస్తూ పరుగెత్తి, కట్టకడకు కళ్ళుమూసుకొని ధైర్యంతో తాను ఏమి చేస్తూన్నాను అనే విచక్షణాజ్ఞానమే లేకుండా తనశక్తికొద్ది పడవలోకి గెంతు

వేసింది. కొద్దిపొరపాటులో నీళ్ళలో పడేదే! కాని లోన నావచెక్కలు తమ కోపాన్ని మోకాలిచిప్పలపైని కనబరచాయి.

ఆ పడవ వూపుకు రాజువచ్చి చూచాడు.

"సరూ, ఇదేంపని? ఇంతధైర్యం చేస్తావనుకోలేదు. ఇప్పుడైనా మించిపోయిందేమీలేదు. వొడ్డువెంబడే వున్నాము, గట్టుమీద దింపివస్తా పద."

"బావా, ఇప్పుడు నన్నువిడిచి వెళ్ళుతావా? నీ వెక్కడో నేనూ అక్కడే. నేను చస్తే యింటికెళ్ళను. ఏమైనాగానీ.... యీ ఏట్లోనే.......... నీతోనే......"

"ఏమి టీ పిచ్చిమాటలు సరూ; మాట్లాడేదానికి సమయం కాదిది. ఆ తెడ్డును తీసుకొని నావను ఎడమవేపు త్రిప్పు"......

ఇప్పుడన్నీ అనుకూలంగానే యున్నాయి. ఆవలిగట్టు చేరతానని ధైర్యం వుంది రాజయ్యకు. కాని అప్పటికే రెండు పెద్దఅలలు తమవంతు నీటితో పడవను నింపివెళ్ళేయి. తన తండ్రివద్ద నేర్చుకున్న నేర్పరితనంతో రెండు సుళ్లను దాటి రాగలిగాడు.

దాదాపు సగం వచ్చినట్లే. అదో దూరాన మినుకుమినుకుమంటూ దీపం కనిపిస్తూంది. తన తల్లేనని గాఢవిశ్వాసము రాజుకు.

అలసిపోయింది సరస. ఇంక కళ్లను ఎత్తలేనంది. రాజయ్య ఆమెకు వెలుగును చూపెట్టాడు. దగ్గర్లోనే వున్నామని ధైర్యం చెప్పాడు. కాని ఆమె అతనివెనుక చేరి నడుమును తన రెండుచేతులతో చుట్టేసింది.

"నన్ను నిడువకు బావా! నాకు భయంగా వుంది. నాన్న ఏమంటాడో బావా!" అంటూంది.

చిన్నపిల్లల్ని కూచోబెట్టుకొని కథలుచెప్పే తాతలాగ,

"ఇదుగో ఒక్కఅడుగే సరూ! ఏదీ చూడు! ఆ వెలుగుపట్టుకొని వుండేదే మన అమ్మ! లే సరూ దగ్గరికొచ్చాము. ధైర్యంగావుండాలి. రేపుపొద్దున మీయింటికి చేరుస్తాలే; లే, లేసరూ," అంటున్నాడు.

అంతే. తెల్లని ఓ పెద్ద అల వస్తూంది. వెలుగును చూద్దామని కళ్ళుతెఱచిన సరసకి అది ఓ తెల్లని రాకాసిలా కనిపించింది, కెవ్వున కేక వేసి బావని మరీ గట్టిగా కావులించుకుంది.

. . . . . . . . . .

కృష్ణమ్మ తనమీదవున్న ఒకభారాన్ని క్రిందకు దింపుకుంది. ఉయ్యాలలో పిల్లలు సుదీర్ఘనిద్రపోయినట్లు కృష్ణమ్మ లాలిలో దీర్ఘనిద్రపోయా రా ప్రణయ జీవులు.

కృష్ణమ్మకూడా రెండురోజులు రోదనచేసింది..

తర్వాత నిండుగర్భిణి (యాకటిమనిషి)లా నడకసాగిస్తూంది.

రెండురోజులతర్వాత నాగాయలంకకు సమీపంలో రెండు శవాలను గట్టుకు చేరవేశారు. గుర్తుపట్టలేనంతగా శరీరంలోకి నీరు ప్రవేశించింది, రెండు శరీరాలూ అంటుకొని వున్నాయి.

ఆరోజు సాయంత్రము సూర్యుడు తనపని చేసుకుంటున్నాడు. కృష్ణమ్మమో తన కేం తెలీదంటూ జారుకుంటూంది మెల్లిగా. ఎంతోమందిని ఎన్నో మార్లు జోలవూపి తనవూయలలో జోకొట్టి నిద్దురపుచ్చింది. నేడు ఈపవిత్ర ప్రణయజీవుల జంటని చల్లగా జోలపాడింది.

ఎంతైనా ఆమే మేలు. కులమత బేధాలు, ధనిక పేద వైషమ్యాలు లేకుండ ఎవరినంటే వారినే తనలో ఐక్యంచేసుకుంటుంది.



గేయం :

# ఉగాదీ - నేస్తా

— శ్రీ చక్రవర్తి రంగస్వామి

ఈనాడు—
ఉయ్యాలలోని పసిబిడ్డ సంబరపడుతోంది
నీ రాక తెలుసా, ఉగాదీ ?
కవులు కంఠమెత్తి కోయిలలతో కలిసి
స్వాగతం పాడుతున్నారు నీకు!
నీ రాకకు మురిసిన తెలుగుతల్లి
అనురాగ మాధుర్యంతో
నవనవంగా విలసిల్లుతోంది !!

చిలుకలూ, గోర్వంకలూ
మావి నీడల ఆడుకొంటున్నాయి!
తేనెపాటలు పాడుకొంటున్నాయి తుమ్మెదలు!
మామిడిపూల వాసనల మత్తులో
దివ్య వసంత ఝరీ ఝణం ఝణ నృత్యధ్వని
వినిపిస్తోంది !
విశ్వసుందరి హృదయంలో
ప్రేమరసం ఉప్పొంగింది కాబోలు !!

నలుబదేండ్లుగా చూస్తున్నాను నిన్ను-
ఇదే చిరునవ్వు,
ఇదే నడకలోని కులుకు,
ఇలానే-యిలానే-వస్తున్నావ్ మనోజ్ఞంగా !

నీవు వచ్చినప్పుడల్లా
మ్రోళ్ళు చివురిస్తాయి !
ప్రకృతి పులకిస్తుంది !
సర్వప్రాణులూ స్వాగతగీతికలు
ఆలాపిస్తాయ్ !

చూడు, ఉగాదీ !
నీ వయస్సూ సౌందర్యమూ
వాడవు కదా !
నీ ఏండ్లు
లెఖ్కకు రావుకదా !

నీవు ఎవరో చెప్పావుకాదు యింతకూ-
విశ్వసుందరి హృదయంలో ఉప్పొంగిన
ప్రేమ కడలివా ?
పొంగిపొరలిన యౌవన గంగవా ?
చక్కిలిగింత పెట్టడానికి వచ్చిన ఆనందమారుతానివా ?
నవనవ వసంత నాట్యసుందరివా ?—ఎవరివి ?

నీ నేత్రాంచల కాంతివెల్లువలో
నా జీర్ణపర్ణ సముదాయం కొట్టుకపోతోంది !
నే కొంగ్రొత్త చివుళ్ల తొడుక్కుంటున్నాను !!
నా గొంతుముడి విడివడుతోంది ఉగాదీ, ఈనాడు !!!



వ్యాసము :

# క్రీడాభిరామము శ్రవ్యకావ్యమే

— శ్రీ కొర్లపాటి శ్రీరామమూర్తి

వల్లభామాత్యుని క్రీడాభిరామము, త్రిపురాంతకుని ప్రేమాభిరామమునకు అనుసరణము. ప్రేమాభిరామము అనుపలబ్ధము. క్రీడాభిరామము సముపలబ్ధము. అనుపలబ్ధమైన ప్రేమాభిరామము భాణ మనియు సముపలబ్ధమైన క్రీడాభిరామము వీథినాటక మనియు అర్వాచీనసిద్ధాంతములు. అనుపలబ్ధమైన ప్రేమాభిరామము అసలు భాణము అని యెట్లు అవగతమైనదో ప్రథమతః దురవగాహము. తదుపరి, సముపలబ్ధమైన క్రీడాభిరామము వీథినాటకానువాద మయిన చంపూకావ్య మని దాని ముఖము చెప్పుచుండ అది మరి వీథి నాటకము అనుట యెట్లు అవకాశమో అంతకంటె దురవగాహము.

"గణన కెక్కిన దశరూపకములయందు
వివిధ రసభావ భావన వీథిలెస్స
యే కవీంద్రుండు రచియించె నీ ప్రబంధ
మనుచు మీరానతిచ్చెదరైన వినుడు." ప. 1.

"ఆ మంత్రిశేఖరుండు రావిపాటి త్రిపురాంతక దేవుండను కవీశ్వరుం డొనరించిన ప్రేమాభిరామ నాటకంబు ననుసరించి క్రీడాభిరామంబను రూపకంబు తెనుంగు బాస రచియించినవాడు" వ. 33

అనికలదు గాన అది నాటకమా ? అయిన మరి ఆయీ మొదటిపద్యమునకు, ముప్పది మూడవ గద్యమునకు మధ్యగల ముప్పది రెండు పద్య గద్యముల విషయమేమి ?

"అని నిష్క్రాంతుండయ్యె నిది ప్రస్తావన" వ. 41

అని కలదు గాన అది ప్రస్తావనమా ? అయిన మరి ప్రస్తావనలో కృతికర్త వంశ వర్ణనము నాటకలక్షణానుసారమా ? అంతే కాదు.

"గద్య. ఇది... వల్లభరాయ ప్రణీతంబైన క్రీడాభిరామం బను వీథినాటకంబున సర్వంబు నేకాశ్వాసము."

అని కలదుకదా, మరి కృతికర్త వంశ వర్ణనముకల ప్రస్తావనవలె ఆశ్వాసపరిగణనము కల నాటకమును నాటకలక్షణానుసారమా ? సూత్రధారప్రవర్తక వదుక్త కృతిపతివంశవర్ణనాత్మక ప్రస్తావనాభాసము కావ్యావతారికగ కరతలామలకము. అంతే కాదు. అంకపరిగణనము దృశ్యకావ్య లక్షణము. ఆశ్వాసపరిగణనము శ్రవ్యకావ్య లక్షణము. కనుక "ఏకాశ్వాస" మనుట శ్రవ్యకావ్య సూచనము. ఇక "రూపకంబు" అనుట విచారణీయము.

"అసలురూపకశబ్దముయొక్క చరిత్ర ఒక ఆలోచనీయాంశము ....... .... .... ... ... .... రూపధాతు వ్యవహారమునకు రూపకశబ్ద వ్యవహారము వ్యతిరేకము. దశరూపకా" నంతర కాలికములైన సమస్త నాటకప్రస్తావనలలోను రూపకశబ్దము నాటక సామాన్యవాచిగ ప్రయుక్తము. "దశరూపక" పూర్వకాలికములైన నాటకములందు రూపకశబ్దము మృగ్యము. ప్రాగ్దశరూపక యుగమునందలి ఒక్క నాటకమందైన రూపకశబ్దప్రయోగము లేకపోవుట విస్మయజనకము. నాటకగ్రంథ

ములతో పాటు లక్షణగ్రంథములలో సహా అంతే. "నాట్యశాస్త్రము" న నాటక సామాన్య వాచిగ రూపకశబ్దము లేదు. [రూపశబ్దము కలదు. అదికూడ సమాసఘటితము. అయిదారుపర్యాయములుప్రయుక్తమైన "దశరూప" సమాసమునకు ప్రదర్శనార్థము ప్రతిబంధక రహితము. నాలుగైదు పర్యాయములు కల "సప్తరూప" సమాసమునకు అర్థనిర్ణయము అతికష్టము. ప్రయోగమది "పూర్వరంగ" పురస్కృతమగుటచే ప్రాయశః అది ప్రత్యేక ప్రదర్శన ప్రక్రియ అగుట ప్రాపణీయము. ఒకచో నాట్యశాస్త్రమున ఒకానొక వాద్యవిశేష మునకును "రూప" శబ్దము ప్రయుక్తము.] "అభినవభారతి" లో రూపకశబ్దము నాటక సామాన్యవాచిగ కలదు. కాని "అభినవభారతి" "దశరూపకము"నకు సమకాలికము. ప్రాచీన వ్యవహారమునందు నాటకసామాన్యవాచి "నాట్యము" లేక "రూపము" మాత్రమే.... తొమ్మిదవ లేక పదవ శతాబ్దినుండి మాత్రమే "రూపక" శబ్దము నాటక సామాన్యవాచి."[1]

పదవ శతాబ్ది తదుపరి తెనుగు సాహిత్య మున నాటకశబ్దమే నాటక సామాన్యవాచిగ స్పష్టము.

"నాటక ప్రయోగంబునుంబోలె ఘనరస పాత్రశోభితరంగరమ్యంబైనదాని" వ. 27. ద్వి. ఆ. ఆదిపర్వము, నన్నయభట్టు.

"ప్రమథపురాతన పటుచరిత్రములు, గ్రమమొంద బహునాటకములాడువారు"—పండితారాధ్యచరిత్ర, పాల్కురికి సోమనాథుడు.

"ప్రస్తావనతో ముఖాదులగు సంధులు సాంగతఁబెంపుమీఱ గంగావతరాది నాటకము లాడె"—ప. 100. చ. ఆ. ప్రభావతీ ప్రద్యుమ్నము, పింగళి సూరన.

నన్నయభట్టునకు పింగళిసూరనకు మధ కాలమున సామాన్యవాచిగ "రూపక" శబ్ద ప్రయోగము ఇతరత్ర మృగ్యము. ఇక తన్మధ్య కాలమున గల శ్రీనాథుని "నాటక" శబ్ద ప్రయోగమొకడు (ఇదివక్ష్యమాణము) దృశ్య కావ్యార్థకమే కాదు. కేవల శ్రవ్యకావ్యార్థకము. కనుక వల్లభామాత్యుని "రూపక" శబ్దప్రయోగ మిదియు శ్రవ్యకావ్యార్థమగుట సావకాశము. కనుక "రూపక" శబ్దమాత్రమున గాక, క్రీడాభిరామ గ్రంథస్వరూపమును బట్టి, అవ తారికా లక్షణమును బట్టి, ఆశ్వాసపరిగణన మును బట్టి అది చంపూకావ్య మని అవగాహ కము. ఇక,

"నటులది దోరసముద్రము
విటులదియోర్గల్లు కవిది వినుకొండ మహా
పుటభేదన మీ త్రితయము
నిటఁగూర్చెను బ్రహ్మరసికులెల్లనుమెచ్చన్"

అని కలదుగాన ఇది దోరసముద్రపు నటులచే ప్రదర్శితము, ప్రదర్శనీయము దృశ్య కావ్యము. దృశ్యకావ్యమే నాటకము. కనుక క్రీడాభిరామము నాటకమే అనుట మరొక అవకాశాభాసము. ఇట ప్రథమతః ఈ పద్య మొక కూటసృష్టి. అది ఇతఃపూర్వమే శ్రీ వేమూరి విశ్వనాథ శర్మగారిచే సుప్రతిపా దితము.[2] ఆ ప్రతిపాదన మిది :

"గ్రంథాంతమునందీ పద్యమున్నది. 'నటు లది దోరసముద్రము....' ఇది శాస్త్రిగారు (కీ. శే. వేటూరి ప్రభాకరశాస్త్రిగారు) ఇచ్చిన

1 D. R. Mankad వ్రాసిన "The Types of Sanskrit Drama" అను పరిశోధన గ్రంథమునకు, నా అనువాదమునుండి అనుసంధితము.

2. భారతి. సంపుటి 4. సంచిక 4. ప్రభవచైత్రము.

పాఠము. మానవల్లి రామకృష్ణకవిగా రచ్చు వేసిన గ్రంథములో ఈ పద్య మిట్లున్నది."

"ఆటునది దోరసముద్రము
నిటునది యోర్గల్లు కడి(ం)ది వినుకొండమహా
పుట భేదనమీత్రితయము
నిటఁగూర్చెను బ్రహ్మ రసికు లెల్లను మెచ్చన్"

దోరగల్లునుండి నటులు, ఓర్గల్లునుండి విటులు, వినుకొండనుండి కవియు గలిసి యోపూరి భైరవుని యుత్సవమునకు వచ్చిన ప్రజలను సంతసింప జేసిరని శాస్త్రిగా రభిప్రాయ పడినట్లుతోచుచున్నది. కానియిందొక యసందర్భ మున్నది. "విటులదియోర్గల్లు" అను పాఠము సరియైనది కాదు. విటులది కాసల్నాడు. ఓర్గల్లు కాదు. "కాసల్నాటి శ్రేష్ఠుడు మీసాలప్పయగారి మేనల్లుడు", "ఎందుండి వచ్చితిరీరు, కాసల్నాటి నుండి వచ్చితిమేముత్పలాక్షి" ఇత్యాది చరణములు పుస్తకము(ల)లోనే యున్నవి. రామకృష్ణ కవిగారి పాఠమే సరియైనదని తోచుచున్నది. ఆ కాలమున దోరసముద్రము, ఓరుగల్లు, వినుకొండలు సుప్రసిద్ధ పట్టణములు. అచ్చట జరుగుచుండెడి క్రీడా వినోదాది విశేషముల నొకచోట జేర్చి రసవంతముగ వర్ణింప బడినవని కవిగా రిచ్చిన పద్యమున కర్థము. కవిగారి యభిప్రాయ మిదేయని యీ క్రింది వాక్యములవలన తేలును.

"ఓరుగల్లును, భళ్ళాలుల రాజధాని యగు దోరసముద్రమును, వినుకొండయు విటుల కనుకూలముగా నుండునని గ్రంథాంత పద్యమున నున్నది. రాజధానులుగ నుండి క్షీణించెడి నగరము లన్నియు నీతిబాహ్య ప్రవర్తనములకు నాటపట్టగునని తోచుచున్నది."

— క్రీడాభిరామ పీఠిక

ఇట వేమూరి విశ్వనాథశర్మగారు ప్రతిపాదించినట్లు వేటూరి ప్రభాకరశాస్త్రిగారి పాఠము అపపాఠమే.[3] క్రీడాభిరామమున విటులైన కాసల్నాటి గోవిందమంచనశర్మ, టిట్టిభసెట్టి ఓర్గల్లు వాస్తవ్యులుకారు. ఆంధ్రనగరయాత్రోన్ముఖులై కాసల్నాటి నుండి వచ్చినవారే.

"ఏకశిలానగరంబునం దార్యవాటంబునం గామమంజరి యను పునర్భువునందు బద్ధానురాగుండై కార్యాంతరవ్యాసంగంబునం దేశాంతర గతుండైన కాసల్నాటి గోవింద మంచన శర్మ నుద్దేశించి యమ్ముద్దియ పుత్తెంచిన యసంబంధీ భూతప్రేమ సంధుక్షణ గర్భంబైన మదనలేఖ సందేశపద్ధతి యది పఠించుచున్నవా డతని కిట్టనుంగుఁ జెలికాఁడు టిట్టిభసెట్టి గావలయును.

— వ. 41

"కాసల్నాటి శ్రేష్ఠుడు
మీసాలప్పయగారి మేనల్లుఁడు ధా
త్రీసురతిలకుఁడు కుసుమశ
రాసన సముఁడంధ్రనగర యాత్రోన్ముఖుడై
ప. 43"

ఆనాడు ప్రసిద్ధురాలగు కామమంజరి యందు బద్ధానురాగుడై కార్యాంతర వ్యాసంగమున దేశాంతరగతుడు కనుకనే, కాసల్నాటి మీసాలప్పయగారి మేనల్లుడు ఆంధ్రనగర యాత్రోన్ముఖుడు. ఆంధ్రనగరము ఓరుగల్లు. ఓరుగల్లువానికి ఓరుగల్లు యాత్రోన్ముఖీభావ మేమి ?- కాక "కాసల్నాటినుండి వచ్చితిమి మేము" (ప. 189.) అని మంచనశర్మ కంఠోక్తియేకదా! మంచనశర్మ కాసల్నాటి శాఖీయుడు కావచ్చుగాక, ప్రకృతి వాక్యమున

3. శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారి పరిష్కరణమున అపపాఠములు అటుంచి, సుష్ఠు పాఠములుకల శ్రీ బండారు తమ్మయగారి పరిష్కరణమున ప్రకృత పద్యము పృథగ్భూతమగుట చింత్యము.

పంచమీ విభక్త్యర్థమున మంచనశర్మ అభిజనము కొసలన్నాడు[4] అనిస్పష్టము. అంతేకాదు. ప్రకృతి వాక్యమిది ప్రభాకరశాస్త్రిగారి పరిష్కరణము నందును యథాతథము. (పుట 61 శృంగారగ్రంథమాల ప్రచురణ, ద్వితీయ ముద్రణము. 1928 సం.) కనుక విటులది యోర్గల్లుకాదు. కవిది వినుకొండయును కాదు. అసలు క్రీడాభిరామమునకు కవి శ్రీనాథుడు అని ప్రభాకరశాస్త్రిగారి అపూర్వసిద్ధాంతము. ఆ శ్రీనాథుని జన్మస్థలము కాశీపట్టణము అని ప్రభాకరశాస్త్రిగారి అభిప్రాయము. (పుట 9. శృంగారశ్రీనాథము). కనుక మరి కవిది వినుకొండ ఎట్లగును? అసలుకవి వల్లభామాత్యునిదైన, వినుకొండ కాదు. ములికినాటిలోని మోపూరు. (ప. 22.) కవిది వినుకొండ కాదు. విటులది ఓర్గల్లుకాదు. ఇక మరి నటులది దోరసముద్రమా?

"అటునది దోరసముద్రము
ఇటునది యోర్గల్లు కడిఁది నినుకొండ..."

ఇట వినుకొండకు ఇనుకొండ అని కలదు. క్రీడాభిరామకృత్యవతరణికను "శ్రుతపర్వతము"అని వినుకొండకు సంస్కృతీకరణము స్పష్టము. (ప. 20.) కనుక వినుకొండ అనుట సహజము. కాని అది యతిమైత్రికి విరుద్ధము. పద్యమునందు సరిపెట్టుటకు సంస్కృతీకరణము చేయుటేగాక, "మధుమావతోర్గంటి మండలమున" అని కూడ వ్రాసిన (ప. 242) వల్లభామాత్యుడు యతిమైత్రికి వినుకొండను ఇనుకొండను చేయుట విపరీతముకాదు. ఇంతకంటె మరి గత్యంతరమును లేదు. ఇక "కడిఁది" అనగా "గొప్పది" అనునట్టి అర్థమునకు భారత హరివంశ రామాయణ ప్రయోగములు, "అశక్యము, అసాధ్యము" అనునట్టి అర్థములను భారత నిర్వచనోత్తర రామాయణ ప్రయోగములు సూర్యరాయాంధ్రనిఘంటువున సుస్థూక్తములు. ఆధిక్యార్థమున ద్రుతకార్యము కంటె యడాగమము. అశక్యార్థమున ద్రుతకార్యము (అచ్చుతోసంధి) అవకాశము. ప్రత్యేకమైన క్రీడాభిరామమున కిది సంస్కారణావశ్యకము. అలతిదోషము లివి అటుంచి, మరి అసలు మంచనశర్మది ఓర్గల్లుకాదు కనుక సమష్టిపై ప్రభాకరశాస్త్రిగారి పాఠము అసంబద్ధీభూతమని అతిస్పష్టము. తత్రాపి, దోరసముద్రపు నటులే హుళక్కి. కనుక నటులు కలరని క్రీడాభిరామము నాటకమనుట అవిచారితరమణీయము.

ఇక దోరసముద్రపు నటులు కాక ఇతర నటులు ఇది ప్రదర్శించుటకు అనువైనది కనుక క్రీడాభిరామము నాటకమే అనుట ఇంకొక అవకాశాభాసము. వల్లభామాత్యుని క్రీడాభిరామము వలెనే వేంకటాధ్వరి విశ్వ

4 "కొసలనాడు : బెంగుళూరుయొద్ద బేలూరు మొదలు నగర సీమకోసల అనియు కోసల అనియు మరియొక మతము.

ములికినాడు : శ్రీగలము (కడప జి. జమ్మలమడుగు) మొదలు జంబుకేశ్వరము లేక మధ్యర్జున (కుంభకోణము) ప్రాంతదేశము...ఇది ఉదయగిరి రాజ్యములోని గండికోట సీమ అంతర్భాగమని ప్రొద్దుటూరు తాలూకాలోని రామేశ్వరమున శాసనమునఁ జెప్పబడి యున్నది. కడప జి. పులివెందల తా. మోపూరు ములికినాటికి ముఖ్యపట్టణము."

—కొండవీటి సామ్రాజ్యము. పుట 155.

గుణాదర్శము, ద్విపాత్ర ప్రయుక్తమే గాక "ఇతర నటులు ఇది ప్రదర్శించుటకు అనువైనది" అనదగిన గ్రంథమే.

"విశ్వావలోకస్పృహయా కదాచి
ద్విమాన మారుహ్య సమానవేషం
కృశాను విశ్వావసు నామధేయం
గంధర్వయుగ్మం గగనే చచార. 5.

తత్ర, 6.

కృశాను రకృశాసూయః
పురోభాగి పదం గతః
విశ్వావసు రభూ ద్విశ్వ
గుణగ్రహణ కౌతుకీ." 7.

క్రీడాభిరామమున మంచనశర్మ, టిట్టిభ సెట్టి ఆంధ్రనగర యాత్రోన్ముఖులే కాని, విశ్వగుణాదర్శమున కృశానువు, విశ్వావసుడు అను గంధర్వులు ఇద్దరును గగనచారులైన విశ్వగుణగ్రహణ కౌతుకితవిహృతులు. మరి క్రీడాభిరామమునందుకంటె విశ్వగుణాదర్శము నందు రచనావిధానమిది :

"[కృశానుః]

గ. అరే! ("సఖే! కథమ్" అని పాఠాంతరము) సకలభువన సంశోషణకారిణం తపనమపి కిం నమనకర్మ కరోషి ? 10.

గ. పశ్య. 11.

ప. పాంథాన్ దీనా నహహ !
వసుమా నాతపన్వా స్వధత్తే
శుష్కాం పృథ్వీం రచయతి
తరాం శోషయ త్యోషధీశ్చ
కాసారాణాం హరతి విభవం
క్షాంతి శాంతి ప్రదానాం
కూ్రిరస్యైవం గుణలవకథా కా ?
స్వతో భాస్వతోఽస్య. 12.

[విశ్వావసుః]

గ. కిమరే! భగవంత మరవింద బాంధవమపి వినాదసి ? శృణు పురోభాగిన్. 13.

ప. వృష్టిం పుష్టిభిః........"

ఇత్యాదిగ ద్విపాత్ర సంభాషణప్రాయమైన విశ్వగుణాదర్శము "శ్రీమదిశాణపాల వేంకటాధ్వరి మహాకవినా విరచితా శ్రీ విశ్వగుణాదర్శ చమ్పూః" అని ముద్రాపకుల ముఖపత్రమే గాక, క్రీడాభిరామమునందు కల గద్యను "ఏకాశ్వాసము" వలె, విశ్వగుణాదర్శము యొక్క ఆశ్వాసాంత గద్యను,

"ఇతి....శ్రీమత్కాంచీనగర వాస్తవ్యస్య వేంకటార్యయజ్వనః కృతిషు విశ్వగుణాదర్శ చమ్పూ స్సమ్పూర్ణా."

అని స్పష్టము. అంతేకాదు. విశ్వగుణాదర్శము చంపూకావ్య మనియే సుప్రసిద్ధము. ప్రదర్శనీయమని ఎవ్వరును దృశ్యకావ్య మన లేదు. అనలేరు కూడ. నాటక లక్షణాభాసము విశ్వగుణాదర్శమునందు వలె క్రీడాభిరామమున క్రీడాభిరామము. కారణమది వీథి నాటకానువాదము కనుక. కనుక క్రీడాభిరామము వీథినాటకానువాదమైన చంపూకావ్యమని విజ్ఞేయము. చంపూకావ్యమైన విశ్వగుణాదర్శమున కల నాటక లక్షణము, బాలవాల్మీకి భట్టమురారి అనర్ఘరాఘవమున, సప్తమాంకమున స్పష్టతరము. శ్రవ్యకావ్య లక్షణ లక్షితమైన అనర్ఘరాఘవము శ్రవ్యకావ్యము కాదు. దృశ్యకావ్యమే. అట్లు దృశ్యకావ్య లక్షణ లక్షితమైన విశ్వగుణాదర్శము దృశ్యకావ్యము కాదు. శ్రవ్యకావ్యమే. అట్లే వీథి నాటక లక్షణ లక్షితమైన క్రీడాభిరామము వీథి నాటకము కాదు. చంపూకావ్యమే. విశ్వగుణాదర్శమున విమానయానము ప్రదర్శనక్లేశమని అది ప్రదర్శనీయము కాదనుట అనవకాశము. కాళిదాసు విక్రమోర్వశీయ

మున విమానయానము కలదు. భట్టమురారి అనర్ఘరాఘవమున పుష్పక విమానయానము కలదు కనుక విశ్వగుణాదర్శమునాటకలక్షణ లక్షితమే. నాటక లక్షణలక్షితమైనను అది చంపూకావ్యము. అట్లు వీథినాటక లక్షణలక్షిత మైనను క్రీడాభిరామమును చంపూకావ్యము.

మరి క్రీడాభిరామమున వీథ్యంగములు కలవు గాన వీథినాటకమే అనుట వేరొక అవకాశాభాసము. వీథినాటకానువాదమైన క్రీడాభిరామమున వీథ్యంగము లుండక మరే ముండును? — అభిజ్ఞానశాకుంతలమునుఆంధ్ర వచనమున వ్రాసినను ఆనాటకాంకములు అపరిహార్యములు. అపరిహార్యములైన ఆ నాటకాంగములను బట్టి అభిజ్ఞానశాకుంతల వచన కావ్యము నాటక మగునా?— అసలుఇతి వృత్త శరీర సంబంధ్యంగములు దృశ్యశ్రవ్య కావ్య సాధారణములు కాదా? కథా ప్రధాన మైన కావ్యములందు బీజబిందు పతాకాదికము సహజము. ముఖప్రతిముఖాదిపంచసంధి ప్రస్థానమును సావకాశము. ఇంతకు వీథ్యం గములు వీథినాటకానువాదము శ్రవ్యకావ్య మైనను, దృశ్యకావ్యమైనను ఆవకాశము. కారణము తదనువాదమే. అంతేకాదు. స్వతంత్రకావ్యమైన పింగళి సూరన్న కళా పూర్ణోదయము ఆయా లక్షణముల లక్షకు లక్ష్యభూతము. కారణము ఆయా లక్షణ ములు ఇతివృత్త సంబంధము లగుట. ఇతి వృత్త మన్నది దృశ్యశ్రవ్య కావ్యములకు సమానము.

"సంధి సంధ్యంగఘటనం
రసాభివ్యక్త్యపేక్షయా
నతు కేవలయా శాస్త్ర
స్థితిసంపాదనేచ్ఛయా."

— ఆనందవర్ధనుడు.

"నాట్యాత్ సముదాయరూపాత్ రసః
కావ్యేచ నాట్యాయమాన ఏవరసః కావ్యార్థః"

— అభినవగుప్త పాదులు.

"ఇతివృత్తంతు కావ్యస్య శరీరం పరికీర్తితం
పంచభిస్సంధిభిస్తస్య విభాగాః పరికీర్తితాః"

— భరతుడు.

కనుక మరి కథా శరీరలక్షణము కావ్య రూపనిర్ణాయకము కాదని కరతలామలకము.

అసలు నాటకము అన్నది దృశ్యకావ్యము. చంపూకావ్యము అన్నది శ్రవ్యకావ్యము. దృశ్యకావ్యము పాత్రికము. శ్రవ్యకావ్యము పాత్రికి దేశము. అంతేకాదు. దృశ్యకావ్యము ప్రత్యక్షపాత్రముఖ సంభాషణాత్మకము. శ్రవ్య కావ్యము పరోక్ష పాత్రముఖ సంభాషణాత్మ కము. అనగా దృశ్యకావ్యమున కవి అంతర మూర్తి. శ్రవ్యకావ్యమున బాహిరమూర్తి. అంతేకాదు. దృశ్యకావ్యమధ్యమున కవి ప్రమేయము గౌణము. శ్రవ్యకావ్యమధ్యమున కవి ప్రమేయము ప్రధానము. అనగా దృశ్య కావ్యమునందు పాత్రసంభాషణమున కవి మధ్యవర్తి. శ్రవ్యకావ్యమునందు పాత్రసంభాష ణమున కవి ప్రత్యేకవ్యక్తి. అనగా దృశ్య కావ్య మధ్యమున కవి ప్రమేయము ప్రయోగ వ్యాపారము. శ్రవ్యకావ్య మధ్యమున కవి ప్రమేయము కథనవ్యాపారము. కనుక దృశ్య కావ్యమున కవివచనము ప్రయోగసూచ నము. శ్రవ్యకావ్యమున కవివచనము ప్రధాన రచనము. కనుక శ్రవ్యకావ్యముకంటె భిన్న ముగ దృశ్యకావ్యమున ప్రయోగసూచనలు. ఆయా శ్రవ్యకావ్య భేదలక్షణముల ఫలస్వా మ్యము ఆయా శ్రవ్యదృశ్యకావ్యముల ఆకృ తిని ప్రతీయమానము. స్థూలదృగ్గోచరమగు ఆకృతి సూక్ష్మహృదయ కవచిత సుస్థశరీ రము. ఆకృతిభేదముతోపాటు దృశ్యశ్రవ్య

కావ్యముల ఆద్యంతముల భేదమును అవశ్య గమనార్హము. ఆశీర్వస్తు నమస్క్రియాత్మక మైన ఆరంభము శ్రవ్యకావ్యమున పద్య మాత్రము. దృశ్యకావ్యమున నాందీవిశేషము. నాంద్యంతమున సూత్రధారపారిపార్శ్వకాది పరివర్తనీయ ప్రస్తావనము దృశ్యకావ్య ప్రత్యేకలక్షణము. నాటకాంతమునందు భరత వాక్యమొకడు భాగధేయము. కనుక ఆద్యంత సమేతమైన ఆకృతి వైలక్షణ్యము దృశ్యశ్రవ్య కావ్య ప్రాధాన్య వివక్షాసాధకప్రాథమిక ప్రధానలక్షణ పరికరము. నాందీప్రస్తావనాదిక భరతవాక్యపర్యంత నాటకశరీర ప్రత్యేకలక్షణ మది నాటక ప్రకరణేహామృగ భాణవీథీ ప్రభృ తుల యథాప్రయోగముగ గ్రాహ్యములు. మరి వీథికి సహోదరమైన భాణముయొక్క శరీరాకృతి ఇది అవశ్య గమనార్హము.

"శృంగారభూషణమ్

మైత్రీం యేన....జగతామానందన శ్చం
ద్రమాః (౧)

అపిచ,

తారాజాలక.... యోషితామ్. (౨)

[నాంద్యంతే]

సూత్రధారః : (సప్రశ్రయ మంజలిం బధ్వా)

అసితమలకే.... వైభవమ్. (౩)

[ఇతి పుష్పాంజలిం వికీర్య నేపథ్యాభి
ముఖ మవలోక్య]

మారిష ! ఇతస్తావత్.

[ప్రవిశ్య]

పారిపార్శ్వకః ; భావ అయ ! మస్మి.

★ ★ ★

సూత్రధారః : (స్మరణ మభినీయ)

సౌభాగ్యస్య నిధిః శ్రుతస్య
వసతి ర్విద్యావధూనాం పరో
లక్ష్మ్యం కేళిగృహమ్ ప్రసూతి
భవనం శీలస్య కీర్తిః పదమ్
నిస్సామాన్య వికాసయా
కవితయా జాగర్తి వత్సాన్వయః
శ్రీమాన్ వామనభట్ట బాణ సుకవిః
సాహిత్య చూడామణిః. (౫)

తేన కవినా ప్రణీతం శృంగార భూషణం నామ భాణం ప్రయుంజానై రస్మాభి ర్నియత మావర్జితైవ సభా.

పారిపార్శ్వకః : సమ్యగుపన్యస్తం భావేన.

★ ★ ★

పారిపార్శ్వకః : సమ్య గుపక్షిప్తం
వసంతాగమ ఇతి. తథాహి—

కుట్మలిత చూత విటపాః
కోమలకలకంఠప్రసరాః
పక్ష్మలిత మదనశౌర్యా మదయంతి
మనాంసి మాధవారంభాః. (౭)

సూత్రధారః : తర్హి నియుజ్యంతం
భూమికాపరిగ్రహాయ భరతలోకాః

★ ★ ★

(నిరూప్య)అయం ఖలు భాగినేయో భరత శేఖరో విలాసశేఖర భూమికా మాదయేత ఏవాభివర్తతే. అయమప్యనంతరకరణీయ సజ్జీభవామి. (ఇతినిష్క్రాంతః)

ఇతి ప్రస్తావనా.

[ తతః ప్రవిశ్య విలాసశేఖరః ]

విలాసశేఖరః : (విలోక్య) అయే, ప్రభాత ప్రాయవిభావరీ, తథాహి,

ఆకులిత తిమిర చికుర మామీలిత
తారకా మసౌ శ్యామామ్
అనుభూయేవ శ్రాంతః సంప్ర
త్యపయాతివారుణీం చంద్రః(౧౦)

(పరివృత్యావలోక్య) అయే, మార్తండస్య ధూర్తజనాచరణ సరణిపైదర్గీ. ఏష ఖలు,

(స్మరణమభినీయ)
"ఆద్యాయ........"

★ ★ ★

ఏషాఖలు మందారికా దుహితా మలయవతీ. త దేనాముపసృత్య సల్లాపయిష్యే.(తథా కృత్వా) అయి మలయవతి !
"జాతిశ్వేతిమ....భాగ్యోన్నతిమ్." (౧౯)
కింబ్రవీషి— 'భావ, కిం న జానాసి గంధసారమ్' ఇతి. (సశ్లథమ్) సాధు రేగంధసార సాధు. ఈదృశభాగ్యానుభవభాజనం భవానేవ ధన్యః. సఖీ మలయవతీ. ఇయ మాశీః.

★ ★ ★

త దేనా ముపసర్పామి. (తథాకృత్వా) సఖి, కమలవతి,
"పరిదర్శిత ....."
కింబ్రవీషి—"భవానేవ...."ఇతి. (సస్మితమ్) శ్రుణు తన్వి.
"ఆమండలీకృత.........యేఽంతరాత్మా."
కింబ్రవీషి–'ధూర్తః నిగూఢం భణ. అంతరస్తే మాధవగుప్తః' ఇతి. (విహస్య) కిం మలయగుప్తో నిష్క్రాసితః ? .......

★ ★ ★

ఇది వామనభట్టబాణుని శృంగారభూషణ భాణము. ఇట ప్రస్తావనము సూత్రధార పారిపార్శ్వక ప్రవర్తితము. అని చెప్పి ప్రస్తావనము తదుభయైకమని కాదు. నటీసూత్రధార ప్రవర్తనీయత అవకాశము. సూత్రధారైక ప్రవర్తనీయత అవకాశము. శూద్రకుని పద్మప్రాభృతకభాణమునందు స్థాపనము సూత్రధారైక ప్రవర్తితము.[5] ధూర్తవిట సంవాద భాణమునందు నాంది లేకపోవుట[5] లక్షణాతిచారము. నాందీ ప్రస్తావనలు రూపక సామాన్యములు. వల్లభామాత్యుని కంటె పూర్వుడైన వామన భట్టబాణుని శృంగార భూషణభాణమునందు నాందీప్రస్తావనలు కలవు. నాంది మంగళశ్లోకము. ప్రస్తావనము కవి సమాచారాదికర్తృగానపాత్ర ప్రవేశ సూచనాత్మక నాటకోపోద్ఘాతము కదా. అట్టి నాందీ ప్రస్తావనలు క్రీడాభిరామమున లేవు. ప్రస్తావనవదుక్త కృతికర్తృ వంశవర్ణనా మాత్రము కృత్యవతరణిక లక్షణము. ఇక నాటక శరీరము-అనగా దృశ్య శ్రవ్య కావ్య ప్రాధాన్య వివక్షాసాధక ప్రాథమిక ప్రధాన లక్షణ పరికరమైన, ఆకృతి వైలక్షణ్యము క్రీడాభిరామమున శృంగార భూషణమునందువలె లేదు. విశ్వగుణాదర్శముకంటె విలక్షణముగ చంపూకావ్యైక సరణిని స్పష్టము. క్రీడాభిరామ గ్రంథ రచనా విధాన మిది అవశ్య గమనార్హము.

వ. అని పరిక్రమించి వెలిపాలెంబు కట్టకడపటఁ గటకార కుటీరవాటికఁ బ్రవేశించి. 67
సీ. ఎకసక్కెముగ నాడు నేదైన నొకమాట. 68

★ ★ ★

వ. అట యుత్తరంబునం గత్తెర నొత్తిపెక్కు వన్నెల బొత్తుల బహువిధ నర్తనల హత్తించి యెత్తికట్టిన పూగుత్తులు మత్తకోకిల కలహంస దాత్యూహ వ్యూహంబులుం గలిగిన మోహరి వాడయందు. 105

★ ★ ★

వ. ఈ వీరపురుషులు మనకుం గార్యసిద్ధి సేయుదురు గాక పదపద మనుచుం గతిపయ పదంబు లరిగి నింబపల్లవ నికురంబ సందానితనందన మాలికాలంకృత ద్వారంబగు నేకవీరాగార గోష్ఠంబు గనుంగొని. 126

ఇత్యాదిగ వర్ణనాత్మకమైన క్రీడాభిరామము నాటకమా ? ఇందు విశ్వగుణాదర్శ చంపూ

కావ్యము నందును లేని గ్రంథకర్తృ మధ్యే మధ్యే పానీయములు కలవు. ఇక శృంగార భూషణభాణసరణి నాటకశరీర లక్షణము అణుమాత్రమును లేదు. వీధి భాణతుల్యము. భాగమునకు విటైకపాత్రవిధానమును, వీధికి ఏకద్విపాత్ర విధానమును మాత్రము భేదము.

"వీథ్యా మేకో భవేదంకః
కశ్చి దేకోఽత్ర కల్ప్యతే,
అకాశభాషితై రుక్తై
శ్చిత్రాం ప్రత్యుక్తి మాశ్రితః
సూచయే ద్భూరిశృంగారం
కించి దన్యాన్ రసానపి
ముఖనిర్వహణే సంధీ
అర్థప్రకృతయో ఽఖిలాః"

అని సాహిత్య దర్పణమున వీథీలక్షణము. కాని నాట్యశాస్త్ర, దశరూపక, కావ్యానుశాసన, నాట్య దర్పణములందు ఏకద్విపాత్ర ప్రయోజ్యకుని వీథీలక్షణము విదితము.

"ఉత్తమాధమ మధ్యాభి
ర్యుక్తా ప్రకృతిభి స్త్రిభా
ఏకహార్యా ద్విహార్యావా
సా వీథీతి సంజ్ఞితా"

అని నాట్యదర్పణమున వీథీలక్షణము. "వక్రోక్తి మార్గేణ గమనాత్ వీథీవ వీథీ." అని దశరూపకావలోకము. భావప్రకాశమున వకుళవీథి, ఇందులేఖ, మాలవిక, రసార్ణవ సుధాకరమున మాధవవీథిక ప్రసక్తములు.[5] ఇంతకు వీథీనాటకము భాణసహోదరము. ఉదాహృత శృంగార భూషణభాణ విధానము ఉదాహృతక్రీడాభిరామగ్రంథమున లేదని గ్రాహ్యము. నాందీప్రస్తావనలు లేవు. నాటక శరీరములేదు. ఇక భరతవాక్యము.

"ముదమున ముల్కినాఁటి
పురమోహన శైలసువర్ణసుందరా
సదనుఁడు కాలభైరవుఁడు
శంభునిపట్టి సమగ్రవైభవా
భ్యుదయ పరంపరా విభవముల్
గృపచేయుఁ గవీంద్ర కాంక్షిత
త్రిదశమహీరుహంబునకుఁ
దిప్పయ వల్లభరాయ మంత్రికిన్. 295

వ. అని యందఱును యథాసుఖంబుగ నిజస్థానంబుల కరిగి సుఖియించుచుండిరి."

ఇది క్రీడాభిరామములోని గ్రంథాంతము. ఇట "అందఱును" ఎవరు? దోరసముద్రపు నటులు, ఓర్గల్లు విటులు, వినుకొండ కవి అను వారలా? లేక క్రీడాభిరామము వీథి నాటకము వీక్షించిన ప్రేక్షకులా? కాక, మంచనశర్మ టిట్టిభసెట్టులతోపాటు కర్ణాటాంగన, కరణకాంత, కుట్రపువాడు, పల్నాటి వీరులకథ పాడినవారా! జక్కుల పురంధ్రి, మైలారుభటులు, మాచల్దేవి, మధుమావతి, మదాలస, కామమంజరి వగైరాలా?-ఆయా పాత్రలు అన్నిటికిని క్రీడాభిరామమున ప్రవేశము బాహాటనిరాఘాటము. ఏకద్విపాత్ర ప్రయోజ్యమైన వీథీనాటక లక్షణోచితమేనా యిది? ఆకాశభాషితాద్యుక్తి ప్రయుక్తులు వలదా? అవి ఉదాహృత శృంగారభూషణమున స్పష్టము. ఇక "తిప్పయ వల్లభరాయమంత్రి" యొక్క స్వకీయ "సమగ్ర వైభవాభ్యుదయ పరంపరావిభవము" భరతవాక్యమా? భరత వాక్యముయొక్క లక్షణము జగద్ధితము కాదా? ఆజగద్ధితము నాటక వస్తూచితము కాదా? వీథీ సహోదరమైన శృంగారభూషణ భాణములోని భరతవాక్య విధానమిది గమనార్హము.

5. T. O. S. D. Pages 72-73.

"వేధో విష్ణుమహేశ్వర
ప్రభృతిభిః సంభావితా నిర్జరై
రాజ్ఞా శాంబర శాసనస్య
మహతీ లోకత్రయే దీవ్యతు
సత్యన్యేషు రసేషు చాస్తు
విజయీ శృంగార ఏకోరసః
సంనాహి స్తనమండలం మృగ
దృశాం తారుణ్య ముజ్జృంభతామ్."

మరి ఇట్లు క్రీడాభిరామములో భరత వాక్యము కలదా ?-ఇంతకు వల్లభామాత్యుని క్రీడాభిరామమున నాందీప్రస్తావనలు లేవు. నాటకశరీరము లేదు. భరతవాక్యము లేదు. నాటకశరీర మనగా నాటక రచనావిధానము. నాటక రచనా విధానమున "అనుచు" వంటి తత్కాలార్థక తద్ధర్మార్థక క్రియావ్యవహారము అనవకాశము. అంతేకాదు. వర్ణనాధోరణి అనవకాశము. ఆకాశభాషితాదులు లేని పాత్ర బాహుళ్యము అనవకాశము. పైగా "సర్వంబు నేకాశ్వాసంబు" అనుట మరి అనవకాశము. అది లేఖకదోషమనిన రూపక వీథినాటక పదములును లేఖకదోషములే. ప్రాచీన లేఖకులకు అంకమని వ్రాయుట అలవాటు లేదనిన, రూపకము, వీథినాటకము అని వ్రాయుట మాత్రము అలవాటు కలదా ? అన్నది ప్రశ్న. ఆయీ పదములకంటె గ్రంథరచనావిధానము కదా గమనార్హము!

మరి విష్ణుమాయావిలాస నాటకము అని మరొక గ్రంథము తెనుగునందే కలదు. నాటకమని గ్రంథనామము. కాని అది నాటకము కాదు. ఆ గ్రంథమున అధికృతమైన విష్ణుమాయావిలాస మొక నాటకము. జగన్నాటకము. జగన్నాటకాధికరణమున విష్ణుమాయా విలాసనాటకనామకరణము. వీథీ నాటకానుకరణమున క్రీడాభిరామవీథినాటక వ్యవహారము. కనుక చంపూగ్రంథమైన క్రీడాభిరామమునందు వీథినాటక వ్యవహారము విపరీతము కాదని విజ్ఞేయము.

ఇక వల్లభామాత్యుని కంటె పూర్వుడైన విన్నకోట పెద్దన కావ్యాలంకార చూడామణి తృతీయోల్లాసమున

"అట్లు కవికృతమైన కావ్యత్రయంబు
గద్య పద్య విమిశ్ర సంపాద్యమండ్రు"
-91 ప.

అనియు, చతుర్థోల్లాసమున,

"అట్టి కావ్యంబు త్రివిధమై యతిశయిల్లు
నవని బద్యమయంబు గద్యాత్మకంబు
పద్యమయ మొప్పు ఛందోనిబద్ధమగుచు
గద్యమయ మొప్పు వాక్యసంకలితమగుచు
5 ప.

ఆ పద్య గద్య కృతములు
రూపకములు నాటకములు
రూఢము లగు నా
రూపము చంపూకావ్యత
ప్రాపించును నాటకములు
బహుళములరయన్." 6 ప.

అనియుకలదు. అనగాకావ్యములు త్రివిధము. 1. పద్యమయము, 2. గద్యమయము. ఇంత వరకు స్పష్టము. ఈమీద కొంత క్లిష్టము. మూడవ విధము పద్యగద్య కృతమా ? పద్య గద్య కృతములగు రూపకములా ?— పద్య గద్యమయ కావ్యములకు రూపకసంజ్ఞ అపురూపము. నాట్యశాస్త్రమున వాద్యవిశేషమునకు నాటకార్థక రూపసంజ్ఞవలె చంపూ కావ్యవిశేషమునకు రూపకసంజ్ఞ క్వాచిత్కముగ కలదేమో ! కానిచో రూపకములు నాటకములు అనుట పునరుక్తి. రూపకశబ్దముచే నాటకములు, నాటకశబ్దముచే రూపకములు గతార్థములు కదా !— నన్నయభట్టు మొదలు



పింగళిసూరన వరకు తెనుగు సాహిత్యమున నాటక సామాన్యవాచిగ రూపకశబ్దప్రయోగము మృగ్యమని పూర్వోక్తము. విన్నకోట పెద్దన సృష్టనాటకసామాన్యవాచి కూడ రూపక శబ్దము కాదు. నాటకశబ్దమే. ఉదాహృత పద్యమునందే "నాటకములు బహుళము లరయన్" అని ఉన్నవిషయము. నాటకములు బహుళము లయిన రూపకములు బహుళములు కాదా? బహుళములు కాని రూపకములు దశవిధరూపకోపరూపబహుళము కాని పద్యగద్యమయకావ్యములేకదా. కనుక విన్నకోట పెద్దన రూపకశబ్దమిట విలక్షణార్థక శ్రవ్యకావ్య భేదమాత్రముగ ప్రతీయమానము. అట్లుకాని పక్షమున "రూపకములు నాటకములు" అను విన్నకోట పెద్దన దృష్టిలో రూపకములేవియో, నాటకములేవియో దురవబోధము. అయినను మరి అంగీకరించిన, ఆ "రూపకములకు నాటకములకు" పద్యగద్యోభయలక్షణమున చంపూకావ్యత్వ ప్రాప్తి సహజము. చంపూ కావ్యములందు నాటకత్వమువలె, నాటకములందు చంపూకావ్యత్వము. అంతేకాని నాటకములు చంపూకావ్యములని కాదు. చంపూకావ్య వ్యవహారము శ్రవ్యకావ్య సంబంధి. సంస్కృతనాటక సామస్త్యము చంపూకావ్య సరణులే కాని అని దశవిధ రూపకములు. అనగా లక్షణైక దేశము కావ్యభేద వివక్షా సాధనము కాదని గమనార్హము. దశవిధ రూపకములు చంపూకావ్యసరణులైనను తదభ్యధిక లక్షణ సమష్టిపై దృశ్యకావ్య దశవిధ రూపకములే. అట్లు క్రీడాభిరామము వీథినాటక సరణియైనను తదభ్యధిక లక్షణ సమష్టిపై శ్రవ్య కావ్యమాత్ర చంపూకావ్యమే అని మరి అవగాహకము. అంతేకాదు. కావ్యాలంకార చూడామణిలోనే,

"సర్గ బంధంబు కావ్యంబు సంస్కృతమునఁ
బ్రాకృతంబున నాశ్వాసభాసురంబు
నాటకములెల్ల నంకసనాథకములు
గద్యముచ్ఛ్వాస లంబకాంకంబ యండ్రు".

అని కలదు. అనగా నాటకము అంకసనాథకము. క్రీడాభిరామము "సర్వంబు నేకాశ్వాసము." ప్రాకృతమునందువలె ఆంధ్రమునందును ఆశ్వాసభాసుర మగునది నాటకము కానట్టి కావ్యమే. కనుక వల్లభామాత్యుని క్రీడాభిరామము శ్రవ్యకావ్యమైన చంపూకావ్యమనుట సలక్షణము.

ఇక విన్నకోట పెద్దన తరువాత, వల్లభామాత్యునికంటె పూర్వమున కల కవిసార్వభౌముడు శ్రీనాథభట్టసుకవి భీమఖండమున కల విశేషమిది అవశ్య గమనార్హము.

"వెండియు భీమేశ్వరుండు పండువు పండువు నఖండ విభవంబున...............

.........................................

అల్లయవేమ భూపాల రాజ్యధురంధరుండై, బెండపూఁ దన్నయామాత్యుడు గట్టించిన మొగసాల వాకిటి మహోత్సవ మండపంబు నందుఁ బేరోలగంబుండి, కుండలీదండలాసక ప్రేరణీ ప్రేంఖణ సింధుకందుక ధమాళిచేలమ తల్లీ హల్లీసకాది నృత్యంబు లవలోకించుచుఁ బంతంబు లవధరించుచు, మేలంబు లాలకించుచుఁ, జంపూచాటు నాటకోదాహరణ జయఘోష చక్రవాళ చతుర్భద్ర చతురాతి ప్రబంధంబు లాకర్ణించుచు, వేణు వీణా మృదంగ గాంస్యకాహళ పటహ ఢక్కా హుడుక్కానక ఝల్లరీ హృద్యవాద్యానుషంగంబు లాదరించుచు, సంగీత భంగీతరంగంబు లంగీకరించుచు, నిగమంబులు గ్రహించుచుఁ బురాణములువినుచు, నితిహాసంబు లిచ్ఛగించుచుఁ, దర్కంబులు వితర్కించుచు నాగమంబులు

పరీక్షించుచు, నిఖిలలోక రక్షణార్థంబుగా వివిధ విద్యా కలాపంబుల వినోదించుచుండు."

— ప్ర. ఆ. వ. 118

ఇట భీమేశ్వరుని వివిధ విద్యా కలాప వినోదము, ఇతః పూర్వమే విద్యాధికారి అయిన శ్రీనాథునికి సమామ్నాతపూర్వము. ఇక వివిధ విద్యాకలాప వినోదమది దక్షారామ భీమేశ్వరాలయమున బెండపూడి అన్నయామాత్యుడు కట్టించిన మొగలి వాకిట ధామమున యథార్థ సంఘటనము. ఏతత్ సంఘటనా ప్రతిపాదనలోని శ్రీనాథుని ప్రతి వాక్యము సార్థకము. "నృత్యంబు లవలోకించు" నవి. "మేలంబు లాలకించు" నవి. "సంగీత భంగీ తరంగంబు లంగీకరించు" నవి "పురాణములు విను" నవి. అట్లు "చంపూచాటు నాటకోదాహరణ జయఘోష చక్రవాళ చతుర్భద్ర చతురాతి ప్రబంధంబు లాకర్ణించు" నవి. ఇట "ఆకర్ణించు" ప్రయోగము అర్థవంతము. అవి మరి "ఆకర్ణించు" నవి కాని "అవలోకించు" నవి కావని అర్థము. "అవలోకించు" నవి దృశ్య కావ్యములు. "ఆకర్ణించు"నవి శ్రవ్యకావ్యములు. కనుక "చంపూచాటు నాటకోదాహరణ జయఘోష చక్రవాళ చతుర్భద్ర చతురాతి ప్రబంధంబులు" శ్రవ్య కావ్యములని స్పష్టము. మరి శ్రీనాథుని సమకాలికుడైన అనంతుని ఛందోదర్పణమున చాటు ప్రబంధ లక్షణము., ఉదాహరణ లక్షణము కలదు.

"మఱియు చాటుప్రబంధలక్షణము :

"ఒకపద్యమైన ముక్తకము రెండును మూఁడు
ద్వికమును త్రికమునై విస్తరిల్లుఁ
బంచరత్నములైదు పరఁగ నెన్మిది గజా
వళికి నామావళి ద్వాదశంబు
నెన్నంగ నిరువదియేడు తారావళి
యెనయు ముప్పదిరెండు నేఁబదియును
నూఱు నూటెనిమిది నుతికెక్కు ద్వాత్రింశ
దభిధాన పంచాశదాఖ్య నాఁగ
వెలయు శతకమనఁగ వెండి యష్టోత్తర
శతకమనఁగనిట్లు సకలసుకవి
సమ్మతముగ నెగడుఁజాటు ప్రబంధము
లభిమతార్థ రచన నబ్జనాభ."

తృ. ఆ. 62 ప

మఱియు ఉదాహరణ లక్షణము :—

"భాసిల్లు సప్తవిభక్తులందును మఱి
సంబోధనంబున సరవిగాఁగఁ
బ్రభు నామయుతముగాఁ బద్యమొక్కటియును
దగఁజెప్పి రగడభేదంబులందుఁ
గళికలు ప్రత్యేకదళము లెన్మిదిచేసి
తత్పరార్థముల నుత్కళికలనఁగ
నేకసమాసమై యేడు దళంబులు
తుద విభక్త్యర్థంబు దోఁపఁబలుక
దానికెనగాఁగఁజిక్కిన దళమమర్చి
ఫణితులొడఁగూర్చి సార్వవిభక్తికముగఁ
గట్టి కడపటి పద్యమొక్కటి రచింప
నదియుదాహరణంబగు నబ్జనాభ!"

తృ. ఆ. 63. ప.

ఇక విన్నకోట పెద్దన కావ్యాలంకార చూడామణిలో కావ్యభేదములుగ చక్రవాళ లక్షణము, చతుర్భద్ర లక్షణములు కలవు.

"చక్రవాళము

క. పద్యంబొక్కటి మొదలను
గద్యాష్టక ముచితదీర్ఘగతిఁ గబ్బములన్
హృద్యదళాష్టక మిడిన స
ముద్యతమగుఁ జక్రవాళమూహింపంగన్.

చ. ఉ. ప. 34.

చతుర్భద్రము

క. ఇదియె చతుర్భద్రంబగు
సదమల ధర్మార్థకామ సహితస్తుతులం
బొదివికొని సర్వరీతుల
విదితంబగునేని శాస్త్ర విదులకునెక్కున్.

చ. ఉ. ప. 39.

"ఇదియె" అనగా "గుచ్ఛతతి"

క. తొలితొలి పద్యమ్మునఁజతు
ర్దళమను నట పల్లవద్వితయమంతమునన్
గల ఘనపద్యము నాలుగు
దళములనన్నింటగుచ్ఛతతియనవలయున్

చ ఉ. ప. 37.

మరి విన్నకోట పెద్దన కావ్యాలంకార చూడామణిలోని,

"బిరుదావళీ ముఖ్య పృథుల ప్రబంధౌఘ
ములు దిగంతంబుల మ్రోయవేని"

చ. ఉ. ప. 43.

అనువాక్యమును బట్టి'జయఘోష'అనుపేరును బట్టి–అనగా జయశబ్దవ్యవహారము, ఘోషణ లక్షణమును బట్టి - జయఘోషమనగా బిరుదావళి అని ఊహించుట అవకాశము. అనగా జయఘోషమనగా బిరుదావళిఅనుట సంభావ్యమైన సమన్వయము. కనుక బిరుదావళీ లక్షణము కావ్యాలంకార చూడామణిలోనే ఇట్లు కలదు.

"బిరుదములు"

క. బిరుశబ్దంబు విరోధో
త్కరము మహారాష్ట్రభాషఁ దత్ప్రద
విధులన్
బిరుదములనఁజను వానిన
ధర బిరుదావళి యొనర్పఁదగు
నంద్రు బుధుల్. 25.

క. వినయభుజ విక్రమక్రమ
ఘనవితరణ రణవిహార బిరుదాది కళా
జననస్థలులగు గుణములఁ
బెనుపొందఁగఁ జెప్పవలయు
బిరుదావళికిన్. 27

చ. అతులకుల క్రమాగతములై
భుజవిక్రమ సంభవంబులై
ప్రతిపద సార్థకంబులయి
పార్థివకర్ణకఠోరకంబులై. 26

తే పద్యదళవాక్యతద్దళపరిసమాప్తి
గదురుపట్లను నెడనెడఁ గలుగవలయు
ధీరగంభీర జయ దేవదేవ యనెడు
లలితసంబుద్ధి వచనంబు లొలయ
వలయు. 29

క. ఉచిత విభక్తికమను గుణ
రుచిరాలంకార రసనిరూఢము నాశీ
ర్వచనంబును నగు పద్యము
రచియింపఁగ వలయు మొదల రంజన
మొప్పన్. 30

ఇక భీమఖండ వాక్యమున "చతుర్భద్ర" తరువాత "చతురాతి ప్రబంధంబు"లని కలదు. అది "చతురాది ప్రబంధంబులు"అని అనుమేయము. అయిన చక్రవాళ చతుర్భద్రముల వలె చతుర మొక సదృశప్రబంధము. ఇక మిగిలినది ఈ వాక్యమున చంపూప్రబంధము. నాటకప్రబంధమును. ప్రబంధమనగాగ్రంథము నాటక ప్రబంధము "ఆకర్ణించు"నది కాని "అవలోకించు"నది కాదని ప్రకరణార్థము. అనగా నాటకమిట శ్రవ్యకావ్య విశేషము కాని దృశ్యకావ్య విశేషము కాదని విజ్ఞేయము. శ్రీనాథుని భీమఖండమునందే,

"కీర్తింతు రెద్దాని కీర్తిగంధర్వులు
గాంధర్వమున యక్షగాన సరణి"

అని స్పష్టము, ఇట యక్షగానము కీర్తన మాత్రము. కనుకనే "ఆకర్ణించు" క్రియ. ఈ కాలమున ఎట్లును యక్షగానము దృశ్య

కావ్యముగ పరిణతము కాలేదు. అట్లు పరిణతమైన, అపరిణతమైన యక్షగానములకు ఆనాటి కవుల నాటకవ్యవహారము బాహాటము. కనుక భీమఖండమునందే కీర్తన మాత్రమైన యక్షగానము, "ఆకర్ణించు నాటక" మగుట అవకాశము. అయిన ఆ భీమఖండమునందలి ప్రకృత వాక్యములోని "ఆకర్ణించు నాటకము" ఒక విలక్షణ శ్రవ్యకావ్యవిశేషమని అనుమీయమానము. అట్లు మరి "ఆకర్ణించు చంపూ ప్రబంధమును" ఒక విలక్షణమైన శ్రవ్య కావ్యవిశేషమని అవగాహకము. ఈ సందర్భమున ఇదే ప్రకరణములోని "పురాణంబులు వినుచు, ఇతిహాసంబు లిచ్ఛగించుచు" అను వాక్యములును అవశ్య గమనార్హములు. శ్రీనాథుని కాలమున ఆంధ్రభాషను పురాణేతిహాసములు చంపూకావ్యములు. కవిత్రయము వారి భారతము, ఎఱ్ఱాప్రెగ్గడ హరివంశ నృసింహ పురాణములు, మారన మార్కండేయ పురాణము ఇందుకు మూదల. ఆ యీ చంపూ కావ్యములును శ్రవణశ్రావణ యోగ్యములు. అయినను పురాణేతిహాస పృథక్కరణమున, చాటునాటకోదాహరణాది సంపర్కమున చంపూప్రబంధమును శ్రీనాథుడు పేర్కొనుట ఆ చంపూకావ్యము అట్టి ప్రబంధవిశేషమని అవగాహకము. అనగా చాటునాటకోదాహరణాదులవలె చంపూప్రబంధమది క్షుద్రప్రబంధ విశేషమని గ్రాహ్యము. అది మరి ఆకర్ణించునది. అనగా శ్రవ్యకావ్యము. వల్లభామాత్యుని క్రీడాభిరామరచనావిధానము శ్రవ్యకావ్యసరణి. శ్రీనాథుని నాటకశబ్దప్రయోగము శ్రవ్యక్షుద్ర ప్రబంధవిశేషమువలె వల్లభామాత్యుని రూపక శబ్ద ప్రయోగమును శ్రవ్యక్షుద్ర ప్రబంధవిశేషమని విజ్ఞేయము. అట్లుకాదని "సర్వంబు నేకాశ్వాసంబు" అనుమాట లేఖకదోషమనుట సావకాశముకాని, క్రీడాభిరామ యావద్గ్రంథ రచనావిధానము లేఖకదోషమనుట నిరవకాశము. శ్రీనాథుని కాలమున చంపూచాటు[6] నాటకోదాహరణ[7] జయఘోష చక్రవాళ చతుర్భద్రచతురాతి (ది) ప్రబంధములు ప్రచార ప్రచురములు. కనుక శ్రీనాథునికంటె అర్వాచీనుడైనట్టి వల్లభామాత్యుడు[8] వీథీనాటకమును చంపూకావ్యముగ వ్రాయుట అవకాశము. కనుక సమష్టిపై వల్లభామాత్యుని క్రీడాభిరామము శ్రవ్యకావ్యమైన చంపూకావ్యమని ఫలస్వామ్యము.

6. చాటు ప్రబంధలక్షణమున పంచాశత్ ప్రబంధ భేదము ప్రసక్తము. "భావపంచాశత్" అను పూర్వగ్రంథమొకడు కలదు. అది, "అదృష్టకవుల ఆణిముత్యాలు" అను ప్రత్యేక వ్యాసమున వివరణీయము.

7. ఇంతవరకు ప్రచురితముకాని "రామాయణోదాహరణము"—సంస్కృతగ్రంథము ఇటీవల నాకు ఉపలబ్ధము. అది "రామాయణోదాహరణము" అను ప్రత్యేక వ్యాసమున ప్రచురణీయము.

8. సర్వపూర్వవాద సమ్యక్పరిశీలనమున, విశేష చారిత్రక నైపథ్య సమన్వయమున వల్లభామాత్యుడు శ్రీనాథునికంటె అర్వాచీనుడని ప్రతిపాదితము. వివరము స్థలవిస్తరభీతిని సముపేక్షితము. అది "వల్లభామాత్యునికాలము" అను ప్రత్యేక వ్యాసమున ప్రస్తరణీయము.

గేయం

# వసంతోత్సవం

— శ్రీ ఊట్ల కొండయ్య

వరదగూడులు కరిగి
వర్షించిన వినేడు
నీమీద నామీద
నిఖిల విశ్వముమీద.

తనువు రంగు తడిసి
మనసు రంగులు ముడిచి
నరునిలో ఒకనెమిలి
పురివిప్పి ఆడింది.

పారుబోతై నరుడు
పారిపోలే డింక
అఖిలవర్ణము లేక
మై, వరదలై వచ్చె.

నీకు నాకును నడుమ
నేడు గోడలు లేవు,
నవవర్ణ వర్షమిది
నవజీవ వర్షమిది.

ఇదె వసంతోత్సవము
ఇల కవతరించింది
తలపు తలుపులు తట్టి
పిలిచింది పలకండి.



# కథానిక - గల్పిక

— శ్రీ బి. వి. కుటుంబరావు, M. A., B. Ed.

దేశకాలవ్యవస్థాతీతంగా మానవసంస్కారపరిణామముతో పాటు కథన సాహిత్యమూ పరిణతి పొందుతూ వెళ్తోంది. దీనికి నిర్వచనాలూ, దీన్నిగూర్చిన విమర్శనలూ అనేవి శృంఖలాలుగా భావించే భావుకులూ వున్నారు; ఇలా విశృంఖలమై నిర్ణీతమైన పెంపు వాపు అవుతుందిగాని బలుపుఅవుతుందా అనే సంస్కార ప్రియులూ వున్నారు.

నేడు మన జాతిలో ధ్వజాయమానుడై మహోత్తాలుడైన యుగకర్తగా సర్వేసర్వత్ర అంగీకరింపబడే మహాకవి అందామా? లేడు. పోతే, యిక శిష్టుల అభిరుచులను తీర్చి దిద్దే ప్రముఖ సాహిత్యక పత్రికలందామా? నిష్పాక్షికమైనవి అసలు లేనేలేవు. ఇది ప్రజాస్వామ్యయుగం. మనకోసం మనమే మనలను గురించి వ్రాసుకోవాలి. కాబట్టి సాధారణ ప్రజలమైన మనం చేతనైనంతలో, ఉన్నంతలో, ఉదారమైన అభిరుచుల్ని తీర్చిదిద్దుకోవాలి రాజకీయ వాదుల చేతుల్లో సాహిత్య మొకసాధనం గాకుండా.

అందుచేత నిర్వచనాలూ విమర్శనలూ, అనేవి కేవలం సంకెళ్లూ కారాదు; అలాగని యేమీలేకుండా విచ్చలవిడీ కారాదు అనేది మధ్యేమార్గం.

నిరంతర సాహితీ స్రవంతిలో ప్రయాణించే చిన్న పటికపు దోనెల వంటివి కథానికలు. నిర్వచనం కథకు ఒక లంగరు వంటిది; వెనకపీకుడుగా, దిగలాగుడుగా వుండే మోయలేని బరువుకాదు. అంటే అది ఆనకట్టగాని, నిల్వునా కట్టిన అడ్డగోడ కాదు. ముంచెత్తే వర్షాలు కురిస్తే ఆనకట్టమీదనుంచి నీరు పొర్లిపోదూ? అలాగే మహనీయకథా సంవిధాన మెరిగిన వరదవంటి వానికి నిర్వచనాలూ సూత్రాలు చెప్పటం గిప్పటం ఉండదు అని, నమ్మో వాళ్లకి రెండుమాటలు చెబుతాను.

ఒక యెత్తుగడా, ఒక నడకతీరూ, ఒకముగింపూ, కొన్ని పాత్రలూ, ఒక పాత్ర పోషణా విధానం, వస్తువిన్యాసవైశిష్ట్యం, వస్త్వైక్యం అనే కొన్ని ప్రత్యేకతలతో వినోద విజ్ఞాన వికాసాదిక సాధనంగా కథానికల పలుకుబడి ప్రజా బాహుళ్యం మీద బాగా చెల్లుబడి అవుతున్న దినాలివి. కాబట్టి నన్నడిగితే విమర్శనాత్మకంగానే కథలు చదవాలి. అంటాను. అలా మనం చదివిన్నాడే రచనలోని ప్రయోజనం సిద్ధిస్తుంది. రచయితకుండా కృషికి అనుగుణమైన కీర్తిని పొంది కృతకృత్యుడౌతాడు.

కథానిక - గల్పిక



ప్రపంచములో కథనసామర్థ్యానికి ఒకప్పుడు భరతఖండానిది పెట్టింది పేరు. ఇటీవల అనేక కారణాలచేత, టాల్‌స్టాయి, చెఖోవ్, మపాసా, ఓహెన్రీ, డి. హెచ్. లారెన్స్, మామ్, హెమింగ్వే, కేథరిన్‌మాన్స్‌ఫీల్డ్, హెచ్. ఇ. బేట్స్, ఫ్రాంక్ ఓకోనాల్, విలియమ్ శారోయిన్, విలియమ్ ఫాక్నర్, ఆర్. యల్. స్టీవెన్‌సన్ ప్రభృతి మహర్షుల ప్రభావం బలీయంగా మనపై ముద్రితమైంది. కాని నేటికిగూడా, కీ. శే. గురజాడ నుంచి శ్రీ పాద వరకూ సాగిన కథానికారచనల్లో భారతీయ ప్రతిభా సమున్మేషా లైనవి చాలా వున్నై.

భిన్న భిన్న మనః ప్రవృత్తులను రంజింపఁజేసేందుకు భిన్న భిన్న మనో రీతులుగల రచయితలు తెలుగులో కథానికావిశేషాలు అని భిన్న భిన్న మార్గాలు తొక్కుతున్నారు. అవి అనూహ్యాలై మనోముగ్ధకారులై సాగుతూ నేటి భారతీయ సాహిత్యంలో సాటిలేనివిగా వున్నై. గల్పిక, అల్పిక, ఛాయ, ఊహాచిత్రం, భావ చిత్రం, వాక్చిత్రం, భావజ్వాల, ఊహాప్రహేళిక మొదలైన పేర్లతో చెంగుచెంగున గెంతుతూ, పొంగెత్తే సెలయేళ్ళ దరిని నిల్చడి శుభోదర్క శోభ నమూ, సుషమాసుందరమూ అయిన భావికాలంలోకి ఊహల నిగిడిస్తూన్న పుణ్యభూమిలో పుట్టిన మనకంటే అదృష్టవంతులెవరు ?

కాకపోతే, మన స్తత్త్వవేత్తలూ, లైంగిక తత్త్వ వేత్తలూ, ప్రతిపా దించిన ఉపచేతనాఽవచేతన (Sub-conscious and Unconscious) మూలకాలు కావడంచేత నేటి కథానికలు, చాలపాళ్లు, ప్రేమసంబంధులనిన్నీ ; ఆర్థిక శాస్త్ర వేత్తలైన మార్క్స్ ప్రభృతులు సిద్ధాంతమూలకాలవడంచేత ఆ కవి సంబం ధులనిన్నీ నిరసింపబడుతున్నై. అయినప్పటికీ సర్వ మానవ సాధారణ్యం గల పురుషార్థాలగూర్చి వ్రాయక, ఆహార నిద్రాదికావశ్యకాలని గూర్చీ వ్రాయక నేలవిడిచినసాము ఎలా చేస్తాం? అందుచేత అంతగా నిర్మాణాత్మకాలుగాని ఆ విమర్శల జోలికి మనం పోలేం.

నేడు మన కథానిక ముఖ్యంగా వస్త్వైక్యాన్ని సాధించేందుకు కొన్ని లక్షణాలను పాటిస్తోంది.

*1*. సంక్షిప్తత : సంగ్రహత అనే అర్థం అసలు చిన్నకథ అనే దాని పేరులోనే వుంది. కాని ఇది దేనికి సంగ్రహము ? నవలకూ, పెద్దకథకూ, సంగ్రహరూపమని కాదు. కథావస్తుసంగ్రహత కలదని భావం. చిన్నకథ చిన్ని

కథ కావాలంటే, వివరాల్లోనూ, సంఘటనల్లోనూ, పాత్రల్లోనూ, అన్నిటి లోనూ, సంక్షిప్తత కనబరచాలి రచయిత.

*2. ఏకాంశవ్యగ్రత* :— ఇది రెండోగుణం. అంటే కథాసంవిధానంలో అనేకాంశాలు అడుగడుగునా ముడిబడి ఉండరాదు; ఒకే అంశంమీద నిష్ఠ నిలపాలి కథానికుడు.

*3. నిర్భరత* :— చదివేటప్పుడు కంటికి తప్పపాటుగాని, వ్రాసేటప్పుడు మనస్సున కేమరుపాటుగాని రానీయని లక్షణమేదో అది నిర్భరత అనే మూడో గుణం.

*4. స్వయంసమగ్రత* :— కథానిక స్వయంసంపూర్ణమై వుండాలి అనేది నాల్గో లక్షణం. అనగా సాపేక్ష్యం గారాదు; నిరపేక్ష్యంగా వుండాలి

*5. ప్రతిపాద్యప్రవణత* :— ఇది అయిదో లక్షణం. అంటే కథానికలో ఏ సత్యాన్ని లేక ధర్మాన్ని ప్రతిపాదిస్తున్నామో, ఆప్రతిపాద్యం (Point) మీదనే మన చూపు నిలపాలి. చెదిరి బెదిరిపోకూడదు. చెదిరిపోతే రెండుతలలు లేక మూడు తలల శిఖండి (Double or trible header) అనే దోషంపేరుతో పిలుస్తాం ఆకథానికను. బెదరిపోతే బీజ సంహారకం అంటాం.

6. సంవాద చాతుర్యం : ఈ లక్షణం ఆరోది. ఇది వెన్నెతో బెట్టిన విద్యగా వుండాలి, కథానికా కర్తకు, చక్కని సంభాషణలనుబట్టే నాటికతో పోటీ చేయగలదు కథానిక.

ఇక ఈ లక్షణాలని ఉదాహరిస్తూ కూడా పోతే తీగ మోయలేని పండు అవుతుంది నా యీ విశ్లేషము. కాబట్టి హృదయ స్పందనం విస్తరణం ద్రవీకరణం గల్గించి, సహృదయుల కానందం గొల్పే శక్తు లున్నయ్యా కథలో అనేదే మనం ఒరిసి చూడాలని ఒక్క మనవితో ముగిస్తాను.

ఈ క్రింద, కాథాసాహిత్య ప్రక్రియకు దేనికైనా సరే వుండాల్సిన ఆఱు తత్త్వాలూ దిఙ్మాత్రంగా చెప్పి, తరవాత నేను గమనించినంతవరకూ కథానికా గల్పికల శిల్పంలోని తారతమ్యాన్ని ఉటంకిస్తాను.

(1) వస్తువు (2) పాత్రలు (3) సంవాదాలు (4) వాతావరణం (5) శైలి, (6) ఉద్దేశం (ఆదేశం - లేక ప్రతిపాదితాంశం.) అనేవి ఆరున్నూ కథన సాహిత్యమూలాధార తత్త్వాలు.

'గల్ప' అంటే హిందీలో కథానిక అనియేఅర్థం కాని కథానికాభేదంగా 'గల్పిక'కు మన తెలుగులో రూఢి యోగం కలుగుతోంది. ఆఖ్యానకము, కథా

నకము, కథానిక, కథాశిక గల్పిక, మొదలైన మాటల్లోని 'అక, ఇక' మున్నగు ప్రత్యయాలు స్త్రీలింగ ద్యోతకాలై సాహిత్య రూపాలకంటె పరంగావడం ఆధునిక యుగంలో సమస్త భాషల్లోనూ ఒక అందం, ఒక ఆచారం అయిపోయింది. పోగా 'కల్పిక' అనే ప్రక్రియ సమకాలీన సారస్వతాల్లో మన ఆంధ్రసాహిత్యములో వున్నంత ప్రస్ఫుటంగా రూపురేఖలుతీర్చి దిద్దుకుంటున్నట్లు చెప్పలేము. పాశ్చాత్యుల్లో మార్క్ట్వెయిన్, ఓ హెన్రి, ఓడ్ హౌస్; ప్రభృతులను వీటికి పితృనిర్విశేషులంటారు. కాని కథానికా భేదంగా 'గల్పిక' అనే శాఖను ఆరాధించడం ఆంధ్రేతర భాషల్లో మృగ్యమన్నా సత్యేతరం కాదు. తెలుగు సాహిత్య విశిష్టతే అనాలి. శ్రీయుతులు కొడవటి గంటివారిది, ఆంధ్ర 'గల్పికకు' పితృవ్యులైన గౌరవం అంటారు. శ్రీయుతులు చలం, హనుమదింద్ర కంటి, శ్రీ శ్రీ మధురాంతక రాజారాం, బలివాడ కాంతారావు, పూఃభా, గోరా శాస్త్రి, రాంషా మున్నగు మహోదయులు, వస్తు, సంవిధాన, శిల్ప, విషయకంగా గల్పికల్లో తీరుతీరులు గల ప్రయోగాలూ, సాధనలూ, చేసి చూపుతున్నారు.

'గల్పా' కొడుతున్నారు అనేవాళ్లు నా చిన్నప్పుడెప్పుడో! ఇప్పటికీ గప్పాలు కొట్టకోయ్ అంటాం. 'గల్భము' అనే పదం సరియైన అర్థమిచ్చేది సంస్కృతంలో ఒకటి వుంది. 'ప్రగల్భం' అనేదియెరగని ఆంధ్రుడుండడు. 'గల్పిక' అనే యీ పదం యే భాషకు చెందిందో దీని పుట్టుపూర్వోత్తరాలేవో స్థలాంతరాన, కాలాంతరంలో సమీక్షించాలి. (1) ముళ్ళు లేని గులాబి సర్పంలేని స్వర్గం ఉండదన్నట్లు వెటకారంలేని 'గల్పిక' కూడా వుండదని కొందఱు ప్రాజ్ఞులు. ఆంగ్లములో 'స్కెచ్' అనబడేదే మనలో 'గల్పిక' అయిందంటారు మఱి కొందఱు. క్రమేణ నిర్ణయించాలి వీటినన్నిటినీ.

---

1. గల్ప (సంజ్ఞా. స్త్రీ. సం. జల్ప యా. కల్ప)
(అ) మిథ్యా ప్రలాప, గప్పా; (అ) డీంగ్, శేఖీ; (ఇ) మృదంగ్‌గే బారహ్ ప్రబంధోంమే ఏక్. (ఈ) ఛోటీ ఛోటీ కహానియా (హిన్దీ శబ్ద సాగర్).

2. గప, గఫ, గప్పా:
A Common report, News, Idle prattle, (Marattee Dictionary, by KULAKARNI.)

3. గల్ప, గప్ప :–
కహానీ (బృహత్ హిందీ కోశ్)

కథానిక : గల్పిక :

1. ఆకృతిలో గల్పిక కథానికకంటే చిన్నది. చిన్నకథ చిన్నదిగా వుండాలి అనే నిర్వచనం చమత్కారానికే, ఆకారంలో చిన్నదిగా వుండడం మాత్రమే దాని లక్షణం గాదనుకోండి.

2. కథానిక మానవ జీవితానికి అచ్చంగా ప్రతిబింబం అయి వుండాలి. గల్పికలో ఆ నియమం అతిక్రమించబడవచ్చు. ప్రాయికంగా హేళనాత్మకం గనుక పాత్రలూ, సన్నివేశాలూ అన్నీ కొంచెం సహజత్వాన్ని మించి అతిశయిస్తాయన్నమాట. అసలు కళలే ఆ మాటకొస్తే కొంచెం సహజత్వానికి అతిశయరూపాలు. కాబట్టి Realism, Idealism అనేవాటిని గూర్చి బహు సూక్ష్మంగా విచారించి, యిక్కడ నిర్ణయం చేయాలి విస్పష్టంగా చెప్పాలంటే.

3. కథానికలాగే గల్పికకూడా పాఠకుణ్ణి ఆశ్చర్యంలో ముంచే కాస్త మెరుపుతోనే అంతమౌతుంది. దీన్నే కథ అడ్డంతిరగడం అంటారు చౌకబారుగా. అయితే జీవత్కథానిక అని చెప్పదగినదాన్ని చదివి ముగించిన చదువరి కాసేపు అంతర్ముఖుడై కథానికాగతాలైన మానవస్వభావాలు మొదలగు వాటిని గూర్చి ఆలోచిస్తాడు. గల్పికను చదివి ముగించిన చదువరి పక్కుమని ఒక్క నవ్వు నవ్వి, అంతలోనే యింకో గల్పిక చదవడానికి ఉపక్రమిస్తాడు.

4. కథానిక మానవ జీవితంలోని ఒక అంశాన్ని చిత్రిస్తే. గల్పిక వ్యక్తి యొక్క అనుభవంలోని దశావిశేషాన్నో, ఒక సంస్థదైన పరిణామ విశేషాన్నో చిత్రిస్తుంది అనాలి.

5. 'సాధారణ మానవజీవితంలో ఒడుదుడుకుల్ని చిత్రించేది కథానిక' అంటే సార్వజనీనత కలది. ఒకానొక వ్యక్తినిగాని, ఒకానొక వ్యవస్థని గానీ అవహేళన చేసేది గల్పిక. అంటే వ్యక్తిపరమైన విశిష్టతనే చిత్రిస్తాడన్న మాట. అది సార్వజనీనమైతే - ఇది వైయక్తికం.

6. కథానికల్లోకంటే గల్పికల్లో సన్నివేశ ప్రాధాన్యం అధికం.

---

4. గల్పతి ; గల్పతి :—

Substantive, Discussion, argument, quarrel. (Nepalese Dictionary by TURNER.)

5. గఫ్ :—

Talk, Conversation, Little tattle, Chit Chat (Ibidum.)

6. 'గల్ప సల్ప' :— ఇది పద్య పద్య గ్రంథము; వంగ భాషలో రవీంద్రకృతము .

7. అలాగే, ఆరోహణావరోహణక్రమవిన్యాసమున్నా, ఉచ్ఛ్రయ పతనాలతో గూడిన ఘటనల చిత్రణమే గల్పికలోని శిల్పం. ప్రడీన-ఉడ్డీన-సండీనాలతో పెనగిన ఒక క్రమవికాసం అంటాం దీనిని.

కాని విశదంగా విడమరచడానికి వీల్లేనంత క్లిష్టంగా ఈ గల్పికా కథానికలు రూపగుణ సాదృశ్యంతో పెనవైచుకొని ఉంటాయని మరువరాదు.

పారిశ్రామిక యుగప్రభావం మనలోనూ బాగా పాదుకుంది. ఆ కారణం చేత మన అభిరుచుల్లో, ఆచార వ్యవహారాల్లో, జీవిత దృక్పథంలో, ఎంతో మార్పు వచ్చినమాట నిజం. అందువల్ల ఇతర సాహిత్యాలలోని పరిణామాలని గమనించక తీరదు. వాటి నెంత గమనించవలసి వచ్చినా, ఎంత అంతర్భూతం చేసుకున్నా గానీ, భారతీయ సంస్కృతిలోని బలాన్ని భారతీయులం మనం స్వీకరించి తీరాలి. జాతీయదృష్టిలేని అంతర్జాతీయతను అంతగా అభినందించలేకపోవడం నా దౌర్బల్యమే కావచ్చు, కాని మన జాతికీ, మన సంస్కృతికీ, సార్వకాలిక ప్రతినిధులుగా మన కథానికలూ, మన గల్పికలూ, నిల్బడాలంటే, (1) వస్తువు, (2) ప్రతిపాదితాంశమూ (ఆదర్శం) (3) కథనశిల్పం, (4) పాత్రలూ. (5) పాత్రపోషణా, (6) సంఘటనలూ, (7) సంవాదాలూ, (8) శైలీ ఇత్యాది సమస్తాంశాలకీ సముచితప్రాముఖ్యం ఉండాలి.

చెప్పవలసిందంతా చెప్పివేశానని నేననుకోలేను. ఈ రచనల విషయం ప్రవాహోదకం వంటిది. కదనుత్రొక్కుతూ ఎప్పుడేయే తెన్నులు పోతుందో సృష్ట్యాదినుండి కథాసాహిత్యం ముందే జోస్యం యెలా చెప్పగలడు సహృదయ విమర్శకుడు? పుట్టని బిడ్డకు పేరు పెడతామా? పురిటిలోనే గల్పిక జాతకం చెబుతామా? మొగ్గని తుంచడానికీ పిందెను కోయడానికీ మీరూ రసజ్ఞులొప్పుకోరు.



పుస్తక సమీక్ష :

# దేవీనవతి

రచన :
శ్రీ మధునాపంతుల సూరయ్యశాస్త్రి

ప్రతులకు : రచయిత
పల్లిపాలెము (Via) యానాం

మూకపంచశతిలోని శ్లోకనవతి కనువాద మీ గ్రంథము. పారాయణ క్రమములో యథామతి నప్పుడప్పుడు అనువదించిన పద్యము లివ్వియని గ్రంథ కర్తయే చెప్పుకొనెను. ఇందులో పదపద్మము - చిఱునవ్వు - కటాక్షము - కొలువు-ఆనందకందము అన్న శీర్షికలతో, ఒక్కొక్కదానియందు పదునెనిమిది చొప్పున పద్యము లున్నవి. అమ్మవారి పదపద్మములను-చిఱునవ్వును-కటాక్షమును పరిపరి విధముల భావనచేసి స్తుతించి, కాంచీపురమున కొలువున్న ఆ యమ్మవారిని హృదయమున స్థిరపరచుకొని జీవుడు ఆనందించుట క్రమముగా చెప్పబడినది. ఇది అనువాదము గనుక భావన విషయమున ఏమి చెప్పినను మూలమును గురించియే చెప్పుట యగును. ఇక పద్యరచన తెలుగున పద్యము ధారాళముగా వ్రాయలేని కవులు మన దేశమున చాల అరుదు. సూరయ్యశాస్త్రిగారు ఉత్తమ తరగతిలోని పద్య రచయితలు. పద సంయోజన, సమాస సంఘటన ఇత్యాదులు రమణీయములు. పద్యరచనలోని మెళకువ తెలిసినవారు శాస్త్రిగారు.

మూఢమానవ మమతాభిమోక్షణములు
శక్రమణిదీప్తి శిక్షా విచక్షణములు
రమ్య లోకత్రయీ రాజ్య రక్షణములు
తల్లి చూపులు వరదానదక్షిణములు.

ఇది గీతపద్యము. పాదాంతయకమువలన పద్యమున కొక ముక్తాయింపువంటి సొగసు వచ్చును. గీతముయొక్క పరిధియే కొద్దియగుటవల్లను, అందును నాలుగు పాదాంతములయందా యమక ముండుటవల్లను ఆ సొగసు కొట్టవచ్చినట్లు కనిపించును. పద్యరచన దానికదిగా నొక ప్రత్యేక విద్య — అమ్మవారి యందలి పరమమైన భక్తిభావముతో వ్రాయబడిన పద్యములు గనుక ఆస్తిక్యబుద్ధి గలవారు పఠింపదగినవి. పారాయణము చేయదగినవి. ఈ అనువాదము చూచిన తరువాత సూరయ్యశాస్త్రిగారు మొత్తము మూకపంచశతి అనువదించిన బాగుండు ననిపించుచున్నది.

— క్షేమేంద్ర

## భామినీ విలాసము

గ్రంథకర్త: శ్రీ వాసిరెడ్డి వేంకట సుబ్బయ్యగారు

ప్రకాశకులు: శ్రీ వాసిరెడ్డి గ్రంథమాల, బ్రాడీపేట, గుంటూరు.

పుటలు 104 వెల: రు. 3-0-0

సంస్కృతములో జగన్నాథ పండితరాయలు రచించిన భామినీ విలాసమున కిది తెలుగుసేత. ఇంతకుమునుపు శ్రీ వడ్డాది సుబ్బారాయుడుగారు మున్నగు పండితకవులెందఱో దీనిని అనువదించియున్నారు. అయినను ఈ గ్రంథకర్తలు తమకు గల అసాధారణప్రజ్ఞతో నీ యనువాదమును సులలితముగ సుమనోహరముగ రచించియున్నారు. శ్రీ ఆవుల గోపాలకృష్ణమూర్తిగారును, స్వయముగా నీగ్రంథకర్తలును రచించిన పీఠికలవలన ఈ గ్రంథగౌరవము ఇనుమడింపజేయబడినదనుటలో సంశయములేదు.

## త్రివేణి

పుటలు 92

గ్రంథకర్తలు: శ్రీ నల్లాన్ చక్రవర్తుల కృష్ణమాచార్యులుగారు
శ్రీ తిరువెంకటాచార్యులుగారు
శ్రీ నల్లాన్ చక్రవర్తుల వేంకట రాఘవాచార్యులుగారు

ప్రకాశకులు: శ్రీ గోదా గ్రంథమాల, శ్రీమన్నారాయణపురం,
ఉల్లిపాలెంపోస్టు, దివితాలూకా, కృష్ణాజిల్లా.

ఇది ఒక పద్యకావ్య సంపుటి. ఇందు మూడు కావ్యములు గలవు. శ్రీ శఠకోప చరిత్రము, శ్రీ పరాంకుశ శతకము, శ్రీ శఠకోప గీతామృతము. గ్రంథకర్తలు వరుసగా పై ముమ్వురును అయియున్నారు. అందఱును నిష్ణాతులయిన పండితులు. కవిత మృదువయి, మధురమయి ప్రవాహగతి నొందియున్నది. భక్తాగ్రేసరులను పులకింపజేయునట్టి దివ్యచరిత్రలు ఇందు సంతరింపబడినవి. ఈ కాలమున ఇట్టి భక్తి ప్రబోధకగ్రంథము లవసరమని వేఱుగా చెప్పనక్కరలేదు.

— ద. సూర్యప్రకాశరావు

# అంతర్దర్శనము

## 27 ఖండకావ్యాల సంపుటి

రచన :
శ్రీ ఉప్పాడ రాజారావు

ప్రకాశకులు :
హనుమంతు మోహనరావు
తలగాము, వయా నౌపడా, శ్రీకాకుళముజిల్లా.

పుటలు 164 క్రౌను ⅛ సైజు వెల : రు. 2-8-0

కావ్యం చివరపుటలలో కవి తన్నుగురించి, తన కావ్యంగురించి యిలాగ చెప్పుకొన్నారు.

స్తవ కాళింగ పురాతన ప్రకట సుక్షత్రాన్వయుండన్, జన
ప్రవణోప్పాడ గృహాభిధానుడ పరబ్రహ్మానుసంధానుడన్
కవిరాట్సార్థక నామధేయుడ మహాకావ్య ప్రణీతుండ, లో
కవివేకార్థము రాజరాయకవి నాకాంక్షల్ పురాయింపగన్.

అంతర్దర్శన నామకంబగు సజీవాంధ్రామృత శ్రవ్య కా
వ్యాంతస్సారము సప్త వింశతి సముద్యచ్ఛీర్షికల్ నించి ధీ
మంతుల్ మేలన గూర్చితిన్ సుకవితామంజూష; సామాజిక
స్వాంతాభ్యంతర దర్శన ప్రియజన ప్రాలంబ దీపాకృతిన్.

అని కవి చేసిన పరిచయంకంటె వేరే సమీక్ష అక్కరలేదు.

కవి కావ్యమ్మున సత్యదర్శనుడు, సత్కార్మిష్ఠి విజ్ఞుండు నౌ
నవలావణ్య విముగ్ధసుందరసఖీ నవ్యాధరాస్వాదన
ప్రవణుండౌనెడ దాను కాముకజన వ్యాపార పారీణుడౌ.

అని కవిని మరీ పచ్చిశృంగారంలో దింపి ఏవేవో పలికించాడీకవిరాజు. ఒక "మగనాలు" అంకుతనానికి పోయి ప్రియునితో పల్కిన మాటలు ఎటువంటి వారినైనా తల దించుకొనేటట్టు చేయిస్తాయి.

మీటిన విచ్చు చన్నుగవమీదను బల్ కసిబూనగనేల ? ప
ల్గాటుల బల్లవాధరముగాఱియ చెప్పెదిదేర ? యూరులన్
గాటపుగోటి గంట్లిడుదె ? కన్నులు మూసియనంగ గేహమున్
మాటికి జుంబనాదులను మన్నన జూపెదవెంత జాణవో ?

ఇటువంటి పచ్చిశృంగారపు చేష్టలు మరులుకొన్న మగవాండ్రు మగని కనుమరపి, రంకుమగలతో జరుపుతూ ఉంటే కవిరాజుగారికి వర్ణించడానికి ఎంతమాత్రమూ మొగమాటమూ లేదు. కాని సభ్యత, సరసత తెలిసిన సహృదయులు మాత్రం ఇటువంటివి చదివి సిగ్గుతో తల వాల్చుకొంటారు. జారిణులు, స్వైరిణులయిన స్త్రీల ప్రత్యంగ వర్ణనలతో ప్రబంధ ధోరణిలోని పచ్చిశృంగారాన్ని తిరిగి జ్ఞాపకం చేస్తున్న ఈ పద్యాలు ఈ కాలంవారికి రుచించాలీ అంటే ఇప్పటి కవితా సంప్రదాయాలూ ఇప్పటి కవితాభిరుచులు మరచిపోవాలి. ఏమైనా ఈ అంతర్దర్శనము- సాహిత్య విశారదులూ, కవిరాజులూ అయిన ఉప్పాడ రాజారావు యం. ఏ. గారి అంతస్సు దర్శించడానికి దర్పణంవంటిది.



## గ్రంథస్వీకారము :

| | |
|---|---|
| నవ్యసాహితి | నవ్యసాహితీ ప్రచురణ |
| పూజాపుష్పాలు | శ్రీ పిల్లలమర్రి సుశీల |
| శ్రీ వరలక్ష్మి విద్యాదర్శిని | శ్రీ వివేకానంద విజ్ఞాన సారస్వతసంఘం |
| బాణకవి (హర్షకథ) | శ్రీ తట్టా రంగరామానుజాచార్యులు |
| కైకేయి | శ్రీ చిట్టిప్రోలు కృష్ణమూర్తి |
| కుమార రుద్రదేవ కవి | శ్రీ అనుముల సుబ్రహ్మణ్య శాస్త్రి |

బాలసాహిత్యము

| | |
|---|---|
| నా కథలు | |
| ఆవూ - హరిశ్చంద్ర | |
| బాలల పండుగ | శ్రీ బి. వి. నరసింహారావు, |
| చిన్నారి లోకం | సకల సాహితీసమితి, |
| బాలరసాలు | విజయవాడ-2. |
| పాలబడి పాటలు | |
| పూలబాలలు | |

## హోమ్ సినిమా ప్రొజెక్టర్

మీ ఇంటి వద్దనే చేత్తో మోసుకొని వెళ్ళడానికి వీలయిన ఈ పోర్టబుల్ ప్రొజెక్టర్‌తో సినిమాను చూసి ఆనందించండి. టార్చి లేక విద్యుచ్ఛక్తితో దీన్ని పనిచేయించవచ్చు. మామూలు 35 మి. మీ. ఫిలిమ్‌ను ఇందులో ఉపయోగించవచ్చు. 4'×4' పూర్తి సైజులో తెరమీద వర్ణచిత్రాలు, సంఘటనలు, నృత్యాలు వాటంతటవే చలిస్తూఉంటాయి. 10 అడుగుల ఫిలిమ్, నడిపే విధానం, సచిత్రంగా తెలిపే కరపత్రం ఉచితం. స్పెషల్ డీలక్స్ రకం రు. 15-50. వి. పి. చార్జీలు రు. 4-50. అదనపు ఫిలిమ్ గజానికి 0-50 నయాపైసలు. రిఫైన్డ్ స్క్రీన్ రూ. 3.



## (డీలక్స్) ఆటోమేటిక్ యాభై గుండ్ల పిస్టల్

### (లైసెన్సు అక్కరలేదు)

ఆటోమేటిక్ యాభై గుండ్ల రిపీటెడ్ డయల్‌తో అమర్చబడిన ఈ అమెరికన్ పిస్టలు పెద్ద ధ్వని, మంటలు కల్గించి దోపిడిగాళ్ళనూ, అడవి మృగాలనూ పారద్రోలుతుంది. సినిమా, డ్రామా నటులకు చాలాఅవసరం శత్రువుల బారి నుండి రక్షించటంలో గొప్ప సహాయకారి. ఖరీదు రు. 10-50. వి. పి. చార్జీలు రు. 2-50. 25 గుండ్లు ఉచితం. అదనపు గుండ్లు డజన్ రు. 1. మేలైన పిస్టల్ కేసు ఒక్కొక్కటి రు. 3-00. రిపేరుచేయటానికి ప్యూయల్ ఆయిల్ రు. 1.




*సాంకేతిక పుస్తకాలు:* మీకు సంపూర్ణ సంతృప్తిని ఇచ్చే హామీ ఇవ్వగలం !

ఎలక్ట్రిక్ అండ్ రేడియో గైడ్ : రు. 15 లతో మీరు స్వయంగా రేడియోను తయారుచేసుకోండి. రేడియో రిపేరీ, వైరింగ్, విద్యుచ్ఛక్తికి సంబంధించిన సమస్తమూ 117 బొమ్మలతో బోధించే ఈ సరికొత్త ప్రచురణ వెల రు. 5. వి. పి. చార్జీలు రు. 1.

భాషా బోధిని : జాపనీస్, చైనీస్, తమిళం, మలయాళం, బెంగాలీ, జర్మనీ ఇత్యాది దేశ విదేశ భాషలు నేర్పించే ఈ పుస్తకం ఖరీదు రు. 5. వి. పి. చార్జీలు రు. 1.

*దర్జీపని కట్టింగ్* రు. 4. *సబ్బుల తయారీ* రు. 3. *ఫోటోగ్రఫీకళ* రు. 3. *సుహాసనవస్తువుల తయారీ* రు. 1-50. *ఒకనెలలోనే హిందీనేర్చుకోండి* రు. 4.

1 నుండి 3 పుస్తకాలవరకు వి.పి. చార్జీలు రు. 1-25] [ఉత్తర ప్రత్యుత్తరములు ఇంగ్లీషులోనే

**Anand Industries, Sasni Gate, Aligarh (INDIA)**

# దక్షిణభారత హిందీ ప్రచార సభ - ఆంధ్ర

## ఖైరతాబాదు - హైదరాబాదు-4



## మా తెలుగు ప్రచురణలు

| | | |
|---|---|---|
| నెలవంక | .... | రు. 2-00 |
| ప్రహ్లాదచరిత్రము | .... | 1-50 |
| శ్రీకృష్ణరాయబారము | .... | 1-50 |
| కథాతోరణము | .... | 2-00 |
| కావ్యతోరణము | .... | 1-50 |
| హిమబిందు | .... | 2-50 |
| ప్రతిజ్ఞాయౌగంధరాయణము - స్వప్నవాసవదత్త | | 1-50 |
| దేశభక్త కొండా వెంకటప్పయ్య పంతులు జీవితము (మొదటి భాగము) | | 2-25 |
| వ్యాసరత్నావళి | .... | 2-00 |
| నెహ్రూచరిత్ర | .... | 2-50 |

★

*ఇవిగాక దక్షిణభారత హిందీప్రచార సభ పరీక్షలకు కావలసిన పుస్తకములు, లైబ్రరీలకు పనికివచ్చు హిందీ సాహిత్యమునకు సంబంధించిన వివిధ పుస్తకములు మావద్ద లభించును.*